# జాబులు

## కీ॥ శే॥ నాంపల్లి గౌరీశంకరవర్మ

గోలకొండ పత్రికసంపాదకులకు,

అయ్యా,

శ్రీనాంపల్లి గౌరీశంకరవర్మగారి మరణవృత్తాంతము తమపత్రికలో చదివి విషాదపడితిని. నేను ౧౯౩౦-౩౪ సంవత్సరములందును హైదరాబాదులో బడిచదువుచదువుచుండగా అవసరమైనగ్రంథములను కొనుసందర్భమున వీరితో పరిచయమేర్పడి కడకుచెలిమిగామేర్పడినది. వారదొంతటి సారస్వతప్రియులో అంతటిదేశారాధకులు. గాంధీగారియెడలను శ్రీవారి కార్యపద్ధతులయెడను వారికివిశ్వాసము మెండుగనుండెడిది. కరాచీలో జరిగినకాంగ్రెసుకువారుపోయివచ్చి ఉపన్యాసత్రయాగమునకు పూర్వమువారు చేయుచుండెడి ఈ ద్రిక్తమైన జాతీయఘోష ఈనాటికిని నాచెవులందుగింగురుమనుచున్నది- నయవర్తనులు, సరసులు, సులభులుఆయిన శ్రీవర్మగారి మరణమునకెంతయు చింతించుచున్నాను- వారు నైజాము మండలవాస్తవ్యులైన ఆంధ్రజనులకు సల్పినసౌకర్యములు సేవలు అచటివారికివివరించి చెప్పపనిలేదు. హైదరాబాదు సంస్థానమందలి ఆంధ్రులచరిత్ర వ్రాయబడునప్పుడు వీరిపేరొక్కని వీరిగూర్చిఎంత యేనిన్రాయవలసియుండునని తలచుచున్నాను.

వేలూరి సదానందం,
మద్రాసు, ౨౨-౭-౧౯౪౧.

## బాగేఆమా

హైదరాబాదునగరములో ప్రజలవాహ్యాళికొరకు ప్రభుత్వమువారు బాగేఆమా(పబ్లిక్ గార్డెన్) ఏర్పాటుచేసినది రాష్ట్రివాసులకంతా తెలియదు. హైదరాబాదునగరానికి కొత్తగావచ్చేవారు మాత్రమిస్థలాలలోఅదొకటి. అయితే యిట్టిబాగె ఆమా దినదినము ప్రజలకు ఉపయోగంలేకుండాపోవుచున్నది. రెండు పెద్దబంగ్లాలువిమట మసుటకట్టబడినవి. అందుకుదానిలో జూబిలీ సంబంధించినవుంటురట- కానిఆబంగ్లాలు ఎప్పుడున్నా మూయబడియుండును- ఒకదానిముందట కొందరు సిపాయీలు ఎల్లప్పుడును పహరాయిచ్చుచుందురు. బాగెఆమా మొదటిద్వారంవద్ద ప్రవేశించగానే యెదుటనివ్వ న తగ్గుపలం ఒకవిశాలమైనతోటయున్నది. అదెన్నియేక రాలున్నదో తెలియదు. దానిలోకియెవరినిన్ని పోనీయరు. ఎవరున్నా పోగూడదుఅని ఒకనోటీసుబోర్డుకూడ పెట్టినారు- జూబిలీహాల్ అని ఒకటికట్టినారు- దానెప్పుడున్నా మూసియుంచబడును- దానివద్ద పహరాయున్నది- టౌనుహాలుఅను పెద్దబంగ్లాయున్నది. అదికూడవెల్లప్పుడు మూతపడియుండును- దానికిసమీపంలో ఒక పెద్దబంగ్లాయున్నది. అది గ్రంథాలయంకొరకు కట్టించినారంట అదిన్నీ మూతబడియున్నది- మ్యూజియం ఒకటి యున్నది- దానిపైభాగంలో చిత్తరువులు పెట్టినారు-కొన్నివారాలనుండి అదిన్నీ మూతపడింది-దానికిసమీపంలో కొత్తబంగ్లాకట్టినారు- అదిన్నీ మూతపడింది ఇదివరలో చాలా చెట్లుండేది- అవన్నీకొట్టివేసినారు- సాధారణంగా సాయంత్రమే అందరువాహ్యాళికెళ్ళుతారు- అప్పుడే మ్యూజియమునుబందుచేసియుంటారు- కొంతిభాగం నీటితోనిండినది. మడుగులవలెనుండు ఆరెండు నీటిభాగాలు ప్రజలకేమిన్నీ యుపయోగపడవు- ఇకమిగిలినదేమున్నది- ఈవిధంగా బాగేఆమా బాగ్ ఖాస్ ఆయిపోతూ ఉంది- ప్రభుత్వమువారు దీనివిషయములో విచారించి బంద్రైనస్థలాలన్నింటిలోను ప్రజలుపోవాటముగాపోవుటకు హక్కు ప్రసాదించవలెను. లేకుంటే ఆదిబాగేఆమాప్రజలతోటఅనిపించుకోలేరదు.

(ఒక ప్రవాసి.)

## బండ్రపల్లిసభ ఏమైనది?

ఇంతకుపూర్వము రెండుమూడు మాసముల క్రిందట జిల్లావార్షికోత్సవము జరుపుటకై ఆంధ్రమహాసభ జిల్లాకార్యదర్శిగారు అహ్వానసంఘపు గంగిరెడ్డిగారు మామాదుక్కప్పగారు మఖ్తల్ తాలూకా చుట్టుపట్టుగ్రామాదులలోతిరిగి వార్షికోత్సవచందాలు పోగుచేసియుండిరి సభజరుపుటకు తేదికూడప్రకటించియుండిరి తర్వాతప్రభుత్వమునుండి అనుమతిలభించలేదని ప్రకటించిరి. ప్రకటించినతర్వాత వార్షికోత్సవమునకు రానున్న ప్రతినిధులు ప్రేక్షకులందరువిచారపడిరి. దీనితర్వాత చిలుకూరుమహాసభజరిగెను, మహాసభతర్వాత జిల్లావార్షికసభలవిషయమై శ్రద్ధతీసుకుంటామని నాయకులనియుండిరి. కానియింతవరకు ఏలాటివిషయములుతెలియక సభఈసంవత్సరముజరుగుతుందాలేదా మాయొద్ద చందాలపైతే తీసుకవెళ్లిరి, సభజరుపకపోయిరికనుక ఆంధ్రమహాసభ జిల్లాసంఘమువారు పైవార్షికోత్సవ విషయములో విపులముగా పత్రికద్వారాప్రకటించిన చాలబాగుండునని సూచన.

ఇట్లు
ఒక ఆంధ్రాభిమాని

భగవాన్ లాల్ నారాయణ్ జీ
అత్తరువ్యాపారులు.
మచ్లీకమాను, హైదరాబాదు.

మావద్ద అన్నివిధములైన స్వదేశఅత్తరు తైలములు అగరుబత్తీలు, కుంకుమపూవు, చావబీలు, జర్ద మొదలగునవి అమ్మబడును,

## బహిరంగలేఖ

లక్ష్మణరాయ పరిశోధక మండలివారి సముఖమునకు

ఆర్యా,

తాముగోలకొండపత్రిక ౧౪-౭-౪౧నాటిలో పత్తేపురం శాసనవిషయమై ప్రకటించినందు కు సంతోషాకృతజ్ఞత.

ఏపరిశోధకమండలివారు యీగ్రామమునకు దయచేసినను ముందుగఒకలేఖ యీదిగువఅడ్రసు ద్వారా పంపించకోరుచున్నాడను- లేఖచూచుకొని తిరిగి వారికి లేఖవ్రాయుట కోరదు-

ఇట్లు
కోటగిరిరావు,
పత్తేపురం,
పెనుబహాదు-పోష్టు,
సూర్యాపేట తాలూకా-

## కృష్ణాపత్రిక హైదరాబాదురాష్ట్రము

సుమారు నాలుగేండ్లక్రిందట నేనురెండుమూడులు కృష్ణాపత్రికవిషయం గోలకొండపత్రికలో వ్రాసియుంటిని. కృష్ణాపత్రికకును నిజాంరాష్ట్రంలో ఇంతోఅంతోవ్యాప్తికలదు. దానికి కృష్ణాపత్రిక ఏమాత్రమున్నా అర్హతసంపాదించినట్టి దికాదు. హైదరాబాదురాష్ట్రంఅనేది కృష్ణాపత్రికయొక్క అట్లాసులోఉందోలేదో. హైదరాబాదురాష్ట్రములోని తెలంగాన ఆసేది వారికెప్పుడైనా జ్ఞప్తికివస్తుందామరి? తెలంగానాలోని ౨౫ లక్షలయాంధ్రులు ఆంధ్రులౌదురో కాదోవారికి? తెలంగానామహాసభ యీసంవత్సరం చిలుకూరిలోజరిగింది వారికి తెలియదా? గతసంవత్సరం మల్కాపురంలో ఆంధ్రమహాసభజరిగింది కృష్ణాపత్రికకు తెలియకపోయెనా? ఇతరతెనుగు వారపత్రికలు ప్రజాబంధు ప్రజామిత్రవంటివి యింతోఅంతో తెలంగానావార్తలనేకాక మరాట్వాడాలో జరిగినవార్తలనుకూడా ప్రకటించుచున్నవికదా! కృష్ణాపత్రికకెందులకింత నిర్లక్ష్యము, తెలంగానా వాసులొక్కరేకాదు వారికి రాయలసీమవారున్నూ కావరారు! ఇక మిగిలినవారే కొద్దిపాటివారో-అయితే మాదివారపత్రిక అన్నిప్రాంతాలవార్తలకు తావున్నదాఅని యందుకేమో? ఉత్తరసర్కారువార్తలకు మాత్రము తావున్నదేనా? కృష్ణాపత్రిక పుట్టిననాటినుండి నేటివరకు రాయలసీమలోని తెలంగానాలోని సాహిత్య సాంఘికార్థికోద్యమా లనుగురించి ఎన్ని సంపాదకీయాలు కృష్ణాపత్రికవారు వ్రాసినారు లెక్కించిచూచినట్లయిన సత్యముని మామకూడా యీ ౩౦ ఏండ్లలో వ్రాయలేదని చెప్పవచ్చును, "వ్రాయలేదు సరేకాని అయితే ఏమంటావు మేమువ్రాయము"అని కృష్ణాపత్రిక అనవచ్చును అదేమాట నేనన్నూ చెప్పపోతున్నాను, తెలంగానాఆంధ్రులు మాకు ఈకృష్ణాపత్రికతో అవసరంలేదని యెందుకు దానిని తెప్పించుకోనాటను ఆపివేయరాదు? వారి మనవారికి సరిపడదు లేకున్న సరిపడదన్నమాట కృష్ణాపత్రికను తెప్పించే తెలంగాణావాసులు, విద్యావంతులు గ్రంథాలయములవారు ఈ విషయాన్ని కొంచెమాలోచించి మనఆత్మగౌరవాన్ని నిలబెట్టుకోగలరు.

ఒక హిందూఆంధ్రుడు

మంచిఫలితములు పొందవలెనంటే

## సింహముమార్కు

అసలైన డబిల్ బాయిల్డ్ అవిశెనూనె, పేవిడి లేక పసుపురంగు (అన్నివర్ణములలోను పౌనుపేకట్లలో దొరకును.)

మరియు

(ఫినైల్, వార్నీషులు, పాలిషులుకూడా దొరకును.)

ఉపయోగించి ఆనందించండి. సరసమైనధరలు అన్ని పైంటు దుకాణములలో దొరకును.

తయారుదార్లు, విక్రయదార్లు:-

దిహైదరాబాద్, ఆయిల్ అండ్, పైంట్ కంపెనీ

బి. 83-3 పబ్లిక్ గార్డెన్ రోడ్
హైదరాబాదు (దక్కన్)
(భారత్ అండ్ సన్సు.)

## పిల్లలపుట్టించేసాధువు

### అర్థరాత్రివేళ వరములిస్తారు

ఖమ్మంమెట్టునకు కొలదిదూరములో పడమరగా మున్నేరునదిప్రవహించుచున్నది- ఆ నదికిపోవుదారిలో బీటుమార్కెటుయెదురుగా ఒకమసీదుగలదు-అమసీదునందు ఒక సాధువువచ్చియున్నాడు -విచారించగా యీతడుమూసుఆరుమాసములక్రిందట యీగ్రామమునచ్చినట్లు తెలియవచ్చినది-వీరు పిల్లలులేనివారికి పిల్లలుకలుగునట్లు వరమిచ్చుటయును మందులిచ్చుటయును గురుపు దురట- స్త్రీ లు కలుగు ఉలు గుసుఖవ్యాధులనుకూడా సునాయాసముగా పోగొట్టుదురట-యీవిషయముపై యీపురమందలి స్త్రీలు, హెచ్చుగా కోమట్లు అమసీదుకువెళ్లి ఆ సాధుగారిసేవచేయుచున్నారు- మిఠాయి,పాలు, వగైరాలతో వారినితృప్తిపరచుచున్నారు- వారిచుట్టును స్త్రీలు ప్రదక్షిణము చేయవలయునట- పగలువెళ్ళిన సాయంత్రమురమ్మనియు, సాయంత్రమువెళ్ళిన రాత్రిరమ్మనియు వరములకొరకైవారిదాలుచేయుచుందురట- రాత్రిపన్నెండు, ఒంటిగంటలప్పుడు స్త్రీలు ఏకాంతముగా సాధువువద్దకుపోవుచున్నారు- కొందరు తెల్లవారువరకును అచ్చటనే వారిసేవలోయుండుటయూకలదట- పాపవిమోగృహీణులు పిల్లలకొరకై ఎన్నిరోజులు అగచాట్లుపడుచున్నారు-చివరకుకొంతమంది భర్తలు ధైర్యమువహించి యీకృత్యము అనుపరణీయముకాదని ప్రతిఘటించుచుటచే చాలవరకువెళ్లుటమానినారు. పైగాతిరుగుడుతప్ప లాభమేమియూ తామెవ్వరునూ పొందలేదని వారేప్రచారముచేసుకొనుచున్నారు- కాన యిట్టివిషయములను పురుషులుగమనించి తమ స్త్రీలకు యీమోసములను విశదపరచవలయును- అనవసరయిబ్బందులకు వారినిలోనుగాకుండా చేయుట తమవిధియని గమనింపవలెను

క్షేమాభిలాషి

హిందూదేశపు యువకులారా మీరు డబ్బు సంపాదించుచు పనినేర్చుకొనండి



నేర్పుపుతైన పనివారలగుటకు

## ఇదియేమీకు మంచి తరుణము!

● గవర్నమెంటువారికి చాలమంది టెక్నీషియనులు కావలసియున్నారు. వారిలో మీరొకరుగా యుండవచ్చును, గవర్నమెంటు టెక్నికల్ ట్రెయినింగు స్కీమునుబట్టి ఒక సంవత్సరము మించకుండా మీకు తీవ్రమైన ట్రెయినింగు ఇచ్చెదరు. ఈట్రెయినింగు ఇచ్చుకాలములో మీకు నెలకు 20 రూ॥ నుండి 25 రూ॥ లు వరకు ఇచ్చెదరు. ఈ ట్రెయినింగు అయినపిమ్మట ఒక వర్తకపరీక్షనివ్వవలెను. ఆపరీక్షలో మీరు ప్యాసయిన పిమ్మట టెక్నికల్ పరిశ్రమ శాఖలు అనగా డిఫెన్సు సర్వీసులు, ఆర్డినాన్సు, మందుగుండు సామానులు తయారుచేయు ఫ్యాక్టరీలు లేక సివిల్ ఇండస్ట్రీస్ మొదలగువాటియందు ఏదో ఒకదానిలో పనిచేయుటకు అర్హులగుదురు.

## హిందూదేశపు పరిశ్రమల భవిష్యత్తుకుతోడ్పడుడు

మీరు ప్రత్యేకమైన టెక్నికల్ జ్ఞానము పొందుటవలనమీసొంతమునకు లాభించుటయే గాక, మీ మాతృదేశమునకు మీరు సుక్కలిగొప్ప సేవచేయుటయు, త్వరలో జయప్రదమైన శాంతిచేకూర్చి హిందూదేశపు పరిశ్రమాభివృద్ధికి తోడ్పడుటయు జరుగును.

## గవర్నమెంటు ఖర్చుపైన పనిని నేర్చుకొనండి

సాధారణముగా ఒకవృత్తిని నేర్చుకొనుటకు మీరుడబ్బుఖర్చుపెట్టవలెను. కాని ఈస్కీముక్రింద గవర్నమెంటువారు మీకు ఉచితముగాపనినినేర్పడమే గాకుండా పనినేర్చుకాలములో నెలకు 20 రూ॥ నుండి 25 రూ॥ వరకు జీతమునూడాఇస్తారు, మీరుచేయవలసిన దేమనగామీపేరు, మీవిలాసమును ఒకపోస్టుకార్డుమీదవ్రాసి దానిని మీచెంతనున్న నేషనల్ సర్వీసులేబరు ట్రిబ్యునల్ వారి చిరునామాకు పంపినయెడల మీకు పూర్తి వివరములుపంపబడును, (ఈ సంస్థయొక్క ఆఫీసులు:-కలకత్తా, మదరాసు, బొంబాయి, నాగపూర్, పాట్నా, కాన్పూరు) షిల్లాంగు,లాహోరు, కరాచీలయందుగలవు.



## చెరువులో ౧౪ ఏండ్ల నుండి నీరులేదు

పన్నుల భారమట్లే!

(ఒక విలేఖరి)

అన్నవరం, షహరేవరు ౨౩

ఈ గ్రామము సూర్యాపేట తాలూకాలోచేరియున్నది. ఇచ్చటిగృహసంఖ్య సుమారు ౩౦౦ గలదు. ఇచ్చటి ప్రజలు ఉత్సాహవంతులు. వీరిలో నుండు విద్యాప్రశంసార్హము. శ్రీయుత తడకమళ్ల రాఘవరావుగారి ప్రోత్సాహమున వీరు ఇచ్చట స్థాపింపబడిన గ్రంథాలయమునకు చందా నిచ్చి పత్రికలు, ఇతర గ్రంథములు తెప్పించుకొనుటకు తోడ్పడినారు. ఇచ్చటి గ్రంథాలయమును సుమారు ౩౦౦ గ్రంథములుగలవు. ఆంధ్రజనసంఘములో కూడా వీరుఉత్సాహముతో ౪౦ మంది సభ్యులుగా చేరినారు. ప్రస్తుత వాతావరణ పరిస్థితిని విచారిస్తే వర్షములు కురియనందున గ్రామములోపు శాలపైరులన్నియు ఎండిపోయినవి. ఇచ్చటి చెరువులోనికి పదునాల్గు సంవత్సరములనుండి నీరురాలేదు. అయినను పన్నుల భారము తగ్గలేదు. ఇకముందయిన ప్రభుత్వము వారిదయకు పాత్రులమగుదుమని నమ్ముచున్నారు.

### అనంతవరం గ్రంథాలయస్థాపన

(ఒక విలేఖరి)

ఈ గ్రామము సూర్యాపేట తాలూకాలోచేరినది. ఇచ్చటి గృహసంఖ్య ౩౪౦ జనసంఖ్య ౧౫౦౦ వరకుగలదు. ఇచ్చటియువకులు కడుఉత్సాహవంతులు. వీరు చాలాదినములనుండియు తమ గ్రామములో గ్రంథాలయ ముండవలెననియు పత్రికలు రావలెననియు కోరుచున్నప్పటికి విధివశమున వారి యభిమతమీడేరదయ్యెను. కాని వీరు శ్రావణ శు|| ౧ సోమవారము శ్రీయుత తడకమళ్ళ రాఘవరావుగారి ప్రోత్సాహముతో తమ గ్రామమందు గ్రంథాలయము స్థాపించుకొనిరి వీరి యావశ్యకమున ఇక ముందు గ్రామసంఘము ఆంధ్రజనసంఘము శాఖగా ఏర్పడుటకు సందేహము లేదు కడుఉత్సాహవంతులగు శ్రీయుత టి. కేశవగిరిరావుగారి ఆధిపత్యమున ఈ గ్రంథాలయము నడచుచున్నది.

## మద్యనిరోధక సంఘస్థాపన

(ఓ. వి.) కొలనుపాక షహరేవరు ౨౦

కొలనుపాక గ్రామము నల్లగొండజిల్లాలో రు రాజుయార్జంగు బహద్దరుగారిజాగీరు, ఇచ్చటిగృహసంఖ్య (౧౧౦౦) జనసంఖ్య ౫ వేలకు పైనున్నది ఇచ్చటొక ప్రాథమిక పాఠశాలమాత్రము జాగీరు పక్షమున నున్నది, మూడుఖాన్గి పాఠశాలలు ప్రజల చే నడుపబడుచున్నవి. ఇవిగాక ఒక ఖాన్గిబాలికా పాఠశాలకలదు, శ్రీమతి కమలాదేవిగారు ౨౦-౩౦ బాలికలకు ఉచితముగ విద్య నేర్పుచున్నారు.

ఇచ్చటి రైతులకోరికపై మద్యనిరోధక కేంద్ర సంఘము పక్షమున ప్రచారకులగు శ్రీయుత బి. రాఘవేంద్రరావుగారు ప్రచారార్థము పంపబడియుండిరి, ౨౦షహరేవరునాడు ప్రచారకులవారు గ్రామములో మద్యనిరోధక సాహిత్యము పంచిపెట్టిరి. సాయంత్రియము మ్యాజిక్ లాంతరు ప్రదర్శనార్థమై సభగావింపబడెను. సభకు చాలమంది విచ్చేసియుండిరి.

లక్ష్మీనరసింహారెడ్డిగారు ము-ని-శే- సంఘప్రచారకులగారిని సభికులకు పరిచయముకలుగజేసిన పిదప మద్యముపై పరిణామకరమగు ఉపన్యాసము నొసంగిరి తదుపరి ప్రచారకులవారిని తమ కార్యక్రమము ప్రారంభింపకోరిరి.

బి రాఘవేంద్ర రావుగారు, మద్యనిరోధక కేంద్ర సంఘముద్దేశ్యము మరియు దానిఆవశ్యకతను తెలుపుచు నిజాంరాష్ట్రములో పెంత్తము ౧౦కోట్ల రూపాయిలు మద్యములపై నష్టపడుచున్న విధానమును వివరించిరి. అర్థికస్థితి మతదృష్టితో మద్యములవల్ల కలుగునష్టములను తెలుపుచు ఈ మహాపాపమునుండి దూరముగ తొలగవలెనని కోరెను, తదుపరి మ్యాజిక్ దీపముద్వారా మత్తుపదార్థము లవల్ల కలుగునష్టములను తెలిపేగుణపాఠమైన చిత్రపటములనుచూపిరి. వీదపక్షతులను తమగ్రామములో మద్యనిరోధక సంఘము స్థాపించి మానవసేవచేయవలెనని కోరుచుచివరకు ము-ని-శే- సంఘపక్షమున సభికులకు కృతజ్ఞతజెలిపిరి

రామచంద్రరెడ్డిగారు వెంకటయ్యగారు మద్యములపై ఉపన్యసించిరి. తదుపరి మద్యనిరోధక సంఘము స్థాపింపబడెను.

## బీదరైతుకూలీల జీవనాధారము

దురాచపల్లినుండి గరుడేపల్లివరకు రోడ్డునిర్మాణము కావలెను

ఈసంవత్సరము సూర్యాపేట తాలూకా గ్రామములపరిస్థితి చాలాఅధ్వాన్నమైపోయినది- వర్షముల పూర్వ్యమైనవి పునాసపైరులు ఎండిపోయినవి- వీనికితగినట్లు కలరావ్యాపకము హెచ్చయినది- బీదలజీవనముదుస్తరమైనది. వారికి పల్లెలలో కూడకరువైనది- కూలీచేసుకొందమన్నను పనిదొరుకుఅవకాశములేదు. వర్షములులేనందున వ్యవసాయపుపనులన్నియుపండుకొనినవి. ఇట్టిసమయమున దయామయులగు ప్రభుత్వమువారువేదైనను పనికల్పించి కూలీఏర్పాటుచేయుటఆత్యవసరము, ఇదివరకు సూర్యాపేటనుండి హుజూరునగరు పోవుటకు ప్రయాణీకులసౌకర్యార్థమై కేవలమోటారుబస్సుల అడాయముక్తలేనేమి దురాచపల్లినుండి గరుడేపల్లివరకు ఒకరోడ్డువేసినచో హుజూరునగరుపోవుటకు చాలాసౌకర్యముగానుండునని తామీరాతు శాఖవారు ఒకప్లాను వేసి మైలురాళ్ళు ఫర్లాంగు రాళ్ళుపాతియుండిరి- ఇదేప్రకారము రోడ్డునిర్మాణముకావించినచో ప్రస్తుతము సూర్యాపేటనుండి కోదాడుమీదుగా హుజూరునగరు పోవుచున్న ఖాన్గిబస్సులపై పోవుప్రయాణీకులకు సౌఖ్యము లాభముకలుగును- దూరభారముకూడాకాదు- సూర్యాపేటనుండి హుజూరునగరు తాలూకాకు చాలాదగ్గరిప్రయాణమగును పైగా ఈకరువుకాలములో కూలీలకేవనముగడచును. ప్రభుత్వమువారు త్వరగా రోడ్డునిర్మాణము ప్రారంభించుట ఆవశ్యకమని మనవిచేయుచున్నాను

ఇట్లు,

డి. సుబ్బారావు,

ఆర్గనైజరు ఆంధ్రజనసంఘం,

తా॥ సూర్యాపేట.

### ఆర్యసమాజముస్థాపన

ధర్మావరం, షహరేవరు ౨౩

ఈ గ్రామము తా॥ మథిర్ జి॥ మహబూబు నగరం ఇక్కడ గతసంవత్సరము కొందరుసర్ణపరులు ఓంధ్వజారోహణ [బాలాజిదేవాలయములో] చేసియుండిరి-అందుకు గ్రామాధికారులు ప్రభుత్వనియమములకు విరుద్ధమని చాలామందియువకులను కోట్టి నాటినుండి నేటివరకు పైవారుచేసిన నచర్యకుజంకి యేమిచేయలేక పూరకుండిరి- భగవదనుగ్రహమువలన ఆర్యసమాజ ప్రచారకులగు శ్రీయుత సాంబమూర్తి సిద్ధాంతరత్నగారువేంచేసి నవయువకుల ప్రోత్సహించి శ్రావణశుద్ధ ౫ సోమవారము ధ్వజారోహణముగావించి ఈ క్రిందవారిని కార్యకర్తలుగా యెన్నుకున్నారు-

ఆధ్యక్షులు-ఆర్ శేషు ఓం ప్రకాశు గారు-ఉపాధ్యక్షులు-కృష్ణభూపగారు- మంత్రి- కంచె కృష్ణమూర్తి గారు-ఉపమంత్రి-బీ-కృష్ణమూర్తి-కోశాధ్యక్షులు-కే-హనుమంతు-పుస్తకాధ్యక్షులు-బి. -రామయ్య-

# గోలకొండపత్రిక

వృషనామసం॥ర శ్రావణ శు॥ ౧౨

సోమవారము


# లోకమాన్యుడు.

"Swaraj is my Birth right"

"స్వాతంత్ర్యము నాజన్మస్వత్వము" అని గర్జించిన సింహము—లోకమాన్య అను ప్రజాప్రపాదిత గౌరవ బిరుదమంది యావజ్జీవమును భారతీయుల సేవకే అర్పించి ఘోరకష్టాల సహించి, చందన వృక్షమువలె దెబ్బదెబ్బకు సువాసననే వెదజల్లుచు అపమాన శక్తి సంపన్నుడైన బాలగంగాధరతిలకు ౧౯౨౦ సం॥ ఆగష్టు ౧వ తేదీనాడు కీర్తి శేషు డయ్యెను.

" Tilak is a name to Conjure with" తిలక అనునామము మంత్రిరాజము" అని మహాత్మా గాంధీ గారే నిండు కాంగ్రెసు మహాసభలో ఆనాడే సెలవిచ్చియుండిరి. అట్టిలోకోత్తరపురుషుని భారతీయులెన్నటికిని విస్మరించరు. భారతీయులు కృతఘ్నులుకారు తమకై చేసిన మేలును మరువరు. ఇంతటి శక్తిని ప్రకటించిన లోకమాన్య తిలకు గారిలోని విశేషమేమి?

వారి జీవితచరిత్రి నిచ్చుట ఇప్పుడు సంగ్రహముగా నైనను వ్రాయబూనుట హాస్యాస్పదముగా నుండును. స్థూలముగానైనను వారి జీవితములోని ప్రధాన ఘట్టములను ఎరుగని భారతీయుడు వ్యర్థుడేయనవలెను. తిలకుగారిలో దేశభక్తి అంగాంగమందు రోమ రోమమందు గాఢముగా వ్యాపించియుండెను. ఏ స్వతంత్ర దేశములోనైనను వారు జన్మించియుండిన వారికి అఖండ గ్రపూజ జరిగియుండెడిది. కాని దాస్య దేశములోజన్మమెత్తిన కారణముచేత వారికి దారిద్ర్యము, జెయిలునివాసము, నిత్యకష్టము అబద్ధవ్యతిరేక ప్రచారము ఇట్టివి బహుళమైపోయెను.

తిలకుగారు అతివాదులలో పరిగణింపబడినట్టివారు. రాజద్రోహములో వారికి ఒకమారు ౬ ఏండ్ల జెయిలు శిక్ష విధించిరి. వారు మాండలేలో జెయిలులోనున్న కాలములోనే గీతారహస్యమును వ్రాసిరి.

దేవుని లీలలు మానవ మాత్రులకు ఎన్నటికినీ అర్థముకావు. ఆనందములో ౨౪ గంటలు ఇంద్రియలోలురైన వారెందరో లోకములోపుట్టిరిగిట్టిరి. వారు పేరు ఊరు చిహ్నములేవియు లేకుండా పోయిరి. ఆజన్మము దారిద్ర్యములో మునిగినవారు కోట్లకొలది లోకములలో జీవించిపోయిరి. కాని వారు తమ పొట్టలకే బ్రతికినవారగుటచేత వారి జాడలు కానరావు. అయితే "ఉదారచరితానాంతువసుధైవకుటుంబకం"అనిపరులకై తమ సౌఖ్యమును, ద్రవ్యమును, కాలమును చింతనములను, తుదకుప్రాణాలనుబలిదానము చేసినవారులోకములో చచ్చినను బ్రదికినవారైయున్నారు. సాక్రటీసుకు విషమిచ్చిచంపిరి. వారిని లోకము నేటికిస్మరించుచున్నది. జెయిలులో ఎందరో మహానుభావులు మ్రగ్గిరి. ప్రపంచాభివృద్ధికి కారాగృహాలు చేసినంత యుపకారము మరెవ్వియుచేయలేదు. బనియను యొక్క పిల్గ్రింసు ప్రోగ్రెసు జెయిలులో రచింపబడెను. శిక్కులవిజృంభణ జెయిల్లమూలాననే కలిగెను గాంధీగారి స్వీయచరిత్ర జయిలులోనే రచితమయ్యెను. జవాహర్లాలు ప్రపంచ చరిత్ర జెయిలులోనే జన్మకుండెను. తిలకుగారి గీతారహస్యముకూడా జెయిలులోనేపుట్టెను. ఈ విధముగా ప్రపంచంలోని ఉద్గ్రంథాలలో పెక్కు జెయిళ్ళలోనుత్పత్తి యయ్యెను.

తిలకుగారి రాజకీయసేవకన్న మించిన సేవ సాహిత్యసేవయైయున్నది. వారు సంస్కృతిములో అపరశంకరాచార్యులు. వారువ్రాసిన వైదికనిలయం, వేదకాల నిర్ణయం, గీతారహస్యం మున్నగు గ్రంథాలు పరిశోధక మండలిలో అగ్రస్థానమువహించునట్టివి. వారు కేసరి మున్నగు పత్రికలను స్థాపించి తద్వారా మహారాష్ట్రులకు అపారమైన సేవచేసినారు. వారిధైర్యము, ఉదారత, నిర్భయత్వము, గంభీరత అన్నింటి కన్న ముఖ్యమైనట్టి నిష్కల్మష జీవనము, భారతీయులందరికిని ఆదర్శప్రాయమైనట్టివి. అట్టిలోకమాన్యుని భారతీయులు మరువకుందురుగాక.

## పాత పాలమూరు,

శ్రీ ఆంజనేయ భక్తసమాజ

పునరుద్ధరణ

(విలేఖరి) ౨౫-౧౦-౧౩౫౦

తేది ౨౪-౧౦-౧౩౫౦ సోమవారమున యింతవరకు [3] మూడుసంవత్సరములక్రిందట జరిగిన కార్తీకపూజల అల్లకల్లోలముల భయోత్పాతము చేతక్షీణించియున్న పైసమాజము నేటికి భయముల నన్నిటినివదలి మహాజనసభజరిగి ఈక్రిందికార్యకర్తలెన్నుకోబడిరి:-

అధ్యక్షుడు. శ్రీయుత ఏగూరుచిన్నప్ప గారు,
సహాయాధ్యక్షుడు ,, పాలుకొండగపురయ్యగారు,
కార్యదర్శి ,, లక్ష్మణశింగు గారు,
సహాయకార్యదర్శి ,, తులజారాం గారు,
సాధారణసభ్యులు - (౧) సి-వీరప్ప,
(౨) బాల్ రెడ్డి,
(3) నాగన్న గారలు.

ఈప్రకారము ఎన్నుకొనిన గర్వాత సంవత్సర వార్షికోత్సవప్రయత్నములం చురుకు గాజసుపుటకు శ్రద్ధగైకొనుచున్నారు.

## కోసిగిలో ఆర్యసమాజస్థాపన

[విలేఖరి] మహబూబునగరం. షహరేవరు ౨౧

తే ౨౩-౧౦-౧౩౫౦ నాడు పైసమాజజండా స్థాపనలో పాల్గొనుటకై మహబూబునగరంనుండి ఆర్యసమాజనాయకులగు శ్రీమాన్ కె మల్లప్ప గారు శ్రీ పండితమర్గదాసు గారు యాం. భద్రప్ప గారు వెళ్ళినారు. హైద్రాబాదు నుండి పండిత నరెంద్ర గారుకూడ వెళ్ళినారని తెలియుచున్నది స్థానిక కార్యదర్శియగు శ్రీ ఏగూరుచిన్నప్పగారు హైదరాబాదులో వర్తకసంఘ కార్యకారిణీసభలో వెళ్ళవలసిరావలసియుండుటచేత కోసిగికి వెళ్ళజాలకపోయిరి

## సర్ హైదరీగారు

హైదరాబాదు[దక్కను, షహరేవరు ౨౬

నై.అ. సర్ అక్బర్ హైదరీగారు అగస్టునెల తుదివరకుపనిచేసి తర్వాత ఉద్యోగముమండి విరమింపుకొందురు. క్రొత్త (ప్రధానమంత్రి) గారు ఉద్యోగస్వీకారం చేయువరకు న॥ అఖీలుజంగు బ॥గారె పనిచూచుకొందురట.

హి.ఆ. సర్ అక్బర్ హైదరీ గారికి నెలకు3000 రూ॥ ఉపకారవేతనమిచ్చుటకై మ ఘ వ. నిజాం ప్రభువు గారు అంగీకార మిచ్చినారని వదంతియున్నది-వీరిదిల్కుషాబంగ్లా వీరికే యుండవలెననీ వీరికొక జాగీరుయిత్తురనిన్నీ వదంతులింకొన్ని బయలుదేరినవి-కాని అందు సత్యములేదనియు పత్రిబలముగా ఊహించబడుచున్నది. సర్ హైదరీగారు ఇంతలో ప్రయుచ్చేలికి అరవిందఘోషు గారి దర్శనార్థము వెళ్లుచున్నారని తెలియవచ్చుచున్నది.

## బాబెహుకూమతు మార్పులు

వదంతులు

హైదరాబాదు(దక్కను), షహరేవరు ౨౬

క్రొత్త ప్రధాన మంత్రిగారి నియామకమైనతర్వాత బాబెహుకూమతు మంత్రిసభలో చాలా మార్పులు కానున్నవని గొప్పవదంతు లున్నవని దక్కన్ న్యూసువారు పత్రికలలో ప్రకటించినారు.

ఫైనాన్సుమంత్రిగా ఒక ఇంగ్లీషుఉద్యోగినియుక్తులుకానున్నారట. నవాబు మెహిదీయార్జంగుబ॥ గారు రాజకీయమంత్రియగుదురట, వారి యధీనమందే విద్యాశాఖయుండునట. న॥అఖీలుజంగుబ॥ గారు ఉపకారవేతనముపై వెళ్ళిపోదురట.

## ఆర్యనియంతముస్లింఅగుట

హైదరాబాదు; షహరేవరు ౨౬

హైద్రాబాదులో ఆర్యసమాజ సత్యాగ్రహము చేసి నాగపూరునుండి ౨౫౦ మందితో జెయిలుకు వెళ్ళిన ఆర్.సీ.రావుఅనువతడు ఇస్లాంమతమునుస్వీకరించినాడు, మక్కా మసీదులో శుక్రవారంనాడు నమాజు చేసినాడు. మౌలవీ బాదుషాహుసేనీగారిద్వారా నూతనమతస్వీకారమును పొందినాడు. అతని నూతననామధేయము ఎప్పుడు అబ్దుల్ ఖాదర్ అని నిర్ణయింపబడినది.

## ౭౫ లక్షలఅప్పు

హైదరాబాదు షహరేవరు ౨౬

హైదరాబాదుప్రభుత్వమువారు మహోకలనిరు యుద్ధముఅప్పుకొరకై ౭౫ రూపాయిలిమాచ్చినారు-ఇంతకుపూర్వము ౫౦ లక్షలు వడ్డీలేకుండా అప్పిచ్చినారు. మరలరెండవమారు ౫౦ లక్షలు మూడురూపాయిలవడ్డీపై యిచ్చినారు, ఇప్పుడు ౭౫ లక్షల 3 రూపాయిల వడ్డీపై యిచ్చినారు ఈవిధంగా మొత్తము ౧ కోటి ౭౫ లక్షల కల్దారురూపాయిలఅప్పును హైద్రాబాదుప్రభుత్వము వారు యుద్ధఋణమునకు గాను ఇచ్చుచున్నారు.

## ముస్లిం బీదవిద్యార్థులు

హైదరాబాదు, షహరేవరు ౨౬

రషీదు తురాబీగారు హైద్రాబాదునగర ఇత్తెహాదు ముఖ్యులలోనొకరు వారిట్లు పత్రికాప్రకటనము చేసినారు.

"ప్రభుత్వమువారు అత్యధికతరమైన సానుభూతిమరియు పోషకత్వము వహించినప్పటికిన్ని ముసల్మానులవిద్యాస్థితి తృప్తికరము గాలేదు అందుచేత బీదవిద్యార్థులకు పుస్తకాలు మున్నగువాటితో సహాయముచేయుటకు ఒకరిజిస్టరు ఏర్పాటుచేసినారు అందు బీదలైనవారు తమ పేరులను విలాసాలనువ్రాయగలరు"

## జినాగారు

హైదరాబాదు గ[దక్కను], షహరేవరు ౨౬

జనాబుగారు రెండవమారు మ ఘ వ. నిజాం ప్రభువు గారినికలిసి మాట్లాడినారు. కొంత అస్వస్థగాఉన్నందున జిన్నా గారు ఇతరులతో కలియలేదు. ఒక్క నవాబుబహద్దరుయార్జంగు బ॥ గారికి మాత్రమువర్శనమిచ్చి వారితో సంభాషించినారు.

## బందిపోటు

హైదరాబాదు (దక్కను) షహరేవరు ౨౬

సికింద్రాబాదుకోర్టులో ౫ మంది డాకాలు చేసినసేరములో విచారింప బడుచున్నారు- వీరు ఘటుకేశ్వరమునుండి భోనగిరివరకుమధ్యనఉండే బాటలలో బందిపోటుదొంగతనాలు చేయుచుండిరట బాటలలోపోవునట్టిస్త్రీలపైనను, ముసలివారిపైనను ఒంటిగాపోవువారిపైనపడి దౌర్జన్యాలు చేసి వారిని లూటీ చేసుకొనిమండిరట, పోలీసు వారికి వీరిపర్యలనుగురించి అప్పుడప్పుడు మొరలు వస్తూఉండినవి-కాని దొంగలుమాత్రము పట్టుపడలేదు కాని దొంగలుమాత్రము తమకుతలిగినమంచి ఆదాయాన్ని దాచుకోలేకపోయినారు-ముఖ్యముగావారు కల్లు దుకాణాలలో తమ సంపదను బాగాప్రకటించుచూ ఉండినారు.-బొయణపల్లి అనుగ్రామంలో వీరు కల్లుకు కాణంలో కూర్చొనియుండగా పోలీసువారుపట్టుకొన్నారు. వీరిలో ఒకనిని మాఫీచేసి సర్కారీసాక్షిగా నిలబెట్టినారు కేసు విచారణలోఉన్నది.

## గ్రంథనిషేధం

హైదరాబాదు, షహరేవరు ౨౬

సావర్కరుగారు ఒకగ్రంథము వ్రాసినారట మహాత్మా గాంధీగారు భావి భారతదేశచక్రవర్తిగా మ-ఘ-వ-నిజాం ప్రభువు గారుఅవుతేకావచ్చును అన్నవ్యాసాన్ని ఖండించుచు భావిభారతచక్రవర్తి నేపాలమహారాజా కావలసియుంటుంది అని వ్రాసినారట అట్టిగ్రంథం హైద్రాబాదురాష్ట్రంలో నిషేధంఅయింది- "గాంధీ ముస్లింసాజిష్"అనే గ్రంథము పూనావాస్తవ్యునిచే వ్రాయబడినది, ఆర్యసమాజంవారు ప్రకటించినబలిదాన్ అనే గ్రంథంకూడ నిషేధింపబడినది.

## దక్కాఅల్లరుల విషయంలో శిక్కుకుశిక్ష

దక్కాలో ఈమధ్యతలలయలు జరుగుచున్న రోజాలలో మార్చి ౨౩ వతేదిన సార్జంటు స్టైమింగ్ గారు డ్యూటీలోనుండగా ఫతేపురియాలో ద్దుమీద రూహార్ సింగుఅను ఒకసిక్కు కృపాణము ధరించిపోవుచుండెననియు, స్టైమింగుగారు ఎవరు గాని ఆయుధధారులై వీధులలోతిరుగుట అప్పుడు నిషిద్ధముకాబట్టి ఆసిక్కును కృపాణమును వదలవలెనని కోరెననియు, అందుకాసిక్కు తానుఆసార్జంటును చంపనైనచంపెదను గాని కృపాణమును వదలననియు చెప్పెననియు, ఆసార్జంటు కన్నీరుపెచ్చునట్లుచేయుమాయువును వదలి ఆసిక్కుమలోంగదీసి, కృపాణమునుగుంజుకొని, సిక్కునుపట్టుకొనిపోయెననియు, ఈవిధముగా డ్యూటీలోఉన్న ప్రభుతోద్యోగిపని జరుగకుండ అటంకపెట్టినందుకు ఆసిక్కునుశిక్షించవలెననియు పోలీసువారు అతనిపై దక్కాలోని అదనపుమేజస్ట్రేటుఅగు జాన్ గారివద్ద అభియోగముపెట్టిరి- మేజస్ట్రేటు గారుఆసిక్కుకు ౯ నెలలకఠినకారాగారవాసశిక్షనువిధించిరి-

## సనాతన విశ్వబ్రాహ్మణాధ్యక్షుని నిర్యాణము

సికింద్రాబాదు-దక్కను, షహరేవరు ౨౫:

(ఒకవిలేఖరి)

వరంగల్ వాస్తవ్యులగు కలచర్ల వెంకటపాపయాచార్యులు గారు వృష॥ సం॥ జ్యే॥బ౧ సోమవారంరోజున హఠాత్తుగామరణించిరి. వీరికి సుమారు౬౦సం॥ వయస్సు. సుమారురెండుమాసములక్రితం వీరిభార్యగతించెను. భార్యగతించుటచే పాపయాచార్యులుగారు బాల్యవివాహముచేసుకొనుటకై వృష-సం॥జ్యే॥బ॥ ౨ మంగళవారం రోజును వివాహముహూర్తము గానిర్ణయించుకొనియుండిరి. శేషువివాహమునకు మరణించినారన్నమాట. ౫రోజులక్రితంకీ-శే- పాపయాచార్యుల గారినికన్నతల్లి గారుగూడా మరణించినారు. వీరు సికింద్రాబాదు లాలాగుడియందు ౮. ౯ మార్చి ౧౯౪౧ తేదీలలోజరిపిన సనాతన విశ్వబ్రాహ్మణ మహాసభకధ్యక్షతవహించినారు. స్థానిక సనాతన సంఘీయులు, బాలవితంతూద్వాహములు నిజాం రాష్ట్రమునందెచ్చుట నే గాని జరుపనివ్వకుండాజేయుటకై అధ్యక్షులైన పాపయాచార్యులగారికి కంకణముగట్టిరి. ఇట్టిసనాతనధర్మరక్షణార్థమై కంకణముకట్టుకున్న పుణ్యాత్మునికిట్లు విపాదముజరుగుట మిక్కిలిచింతాకరమైనవిషయము. కీ-శే-పాపయాచార్యుల గారికిని మరియు వీరిభార్యకును తల్లిగారికి ఆముష్మికసౌఖ్యముకు కాంతికలిగియుండవలెనని మాయొక్క విశ్వబ్రాహ్మణుడైనా యుండవలె-

## ఛత్తారీ నవాబు గారు

### ముస్లింలీగుకు స్వస్తి చెప్పుకొనుట

హైద్రాబాదు రాష్ట్రానికి ప్రధానమంత్రిగా ఏర్పాటైన ఛత్తారీనవాబుగారు యూ-పీ-ముస్లింలీగులో ప్రధానసభ్యుల గానున్నారు. కానీ వారైనాటి లక్నోనుండివచ్చిన ఏ-పి-వార్త ఈవిధముగాప్రకటించుచున్నది.

హైద్రాబాదురాష్ట్రప్రధానామాత్యులుగా నియమింపబడిన ఛత్తారీనవాబుగారు ముస్లింలీగులోనూ, శాసనసభలోను, యుద్ధసంఘములోను తనకుండినసభ్యత్వానికి రాజీనామాయిచ్చియున్నారు. అగస్టుతుదివారములోనో లేక సెప్టెంబరు మొదటివారములోనో వారుతమనూతనపదవిపైకెళ్లుదురు.

## డిండీప్రాంతంలో అడవిజంతువులు

మహబూబునగరంజిల్లాలో డిండీనదికి ఆనకట్టకట్టుచున్నారు అక్కడ అడవులుండుటచేత ఆప్రాంతమందు పెద్దపులులు చిరుతలు నిరాఘాటముగాసంచరించుచున్నవి, అందుచేత అక్కడపనిచేయుఅధికారులు కూలీలు భయభ్రాంతులైనారు, ఇకముందుఅట్టిభయంకరజంతువులను తుపాకులతోకాల్చి చంపవచ్చునని ప్రభుత్వమువారు సెలవిచ్చినారు.

## బలవంతపుసైన్యంభర్తీ

హైద్రాబాదు, షహరేవరు ౨౬

హైద్రాబాదునగరములో జిల్లాలలోను యుద్ధములోనికిపంపుటకు జనులను బలవంతముగా సైన్యములో సిపాయీలనుగా లాగుకొనిపోవుచున్నారని వదంతులుఅంతటను వ్యాపించియున్నవి. నగరములోకూడా మితిమీరినవదంతులు బయలుదేరినవి. "ఫలానినగరములో కోటూరుపైన కొందరుమిలటరీవారువచ్చిరి. బాటసట్టుకొనిపోయెయుద్దరిని చెంపదెబ్బలువేసిలాగి మోటారులోవేసికొనిపోయినది నేను కన్లారచూచినాను నా తో యింకోమనిషిఆన్నాడని వాళ్ళేమీతుడం మొన్నె నాతో చెప్పినాడండీ" అనితరుచుగా ఇట్టివదంతులు విద్యావంతులే వ్యాపింపజేయుచున్నారు అందుపై 'ఏ-పి-' వార్త యిట్లుప్రకటించుచున్నది,

"సైన్యంలో బలవంతముభర్తీ చేస్తున్నారను వదంతివిగురించి విచారించగా అట్టిదేమియున్నలేదని రూఢిగా తెలిసింది. ఈవదంతులన్నీ నిరాధారమైనవి. ఎవ్వరైతే ఇట్టితప్పుడువదంతులను వ్యాపింపచేయుదురో వారిపై చర్యగైకొనబడును"

## తిలకజయంతి

హైదరాబాదు షహరేవరు ౨౬

హైదరాబాదునగరములో ౧ అగస్టునాడు లోకమాన్య బాలగంగాధరతిలకు గారి జయంతి హిందూప్రజామండలివారిచేత గావింపబడెను.

మండలివారు హిందూజండాలనుఅమ్మిరి. సాయంత్రము శంకరరావు బూర్గుంకరుగారి అధ్యక్షతలో సభజరిగెను వై-డీ-జోషి చంద్రపాలు వినాయక రావుగారలు మొదలగువారు తిలకు గారిజీవితమునుగురించి యుపన్యసించిరి, తర్వాత హైద్రాబాదు రాజ్యాంగశాసనమును త్వరలో ప్రవేశపెట్టవలెననియు, అఖాడాగస్తిని రద్దుచేయవలెననియు తీర్మానాలుచేసిరి.

## దక్షిణదేశపు రైళ్లలో ఊయెలలు

సౌత్ ఇండియన్ రైల్వేవారి త్రివేంద్రం యక్స్ప్రెసునందు స్త్రీలకైప్రత్యేకించబడినవగరగతిదబ్బాలలో ఊయెలలుపెట్టుటవల్ల స్త్రీప్రయాణీకులద్వారాఎక్కువలాభమనితోచినందువల్ల ఇపుడుమలబారుయక్స్ప్రెస్సందలిస్త్రీల డబ్బాలలోకూడ ఊయెలల ఏర్పాటును చేయుచున్నారు.

# మిలటరీవేషముతో దౌర్జన్యము

భువనగిరి ౨౨-౧౦-౫౦ ఫ

నేను వ్యాపారార్థం తాలూకా షాబాద, తాలూకా పర్గీలలోని కొన్నిగ్రామములు తిరిగితిని. తాలూకా షాబాదలోని బస్తీపురంగ్రామములో వాంతిభేదుల (కలరా)చేతమూరు ముప్పైమంది మరణించినారు, దానిసమీపములో అలూరుఅను గ్రామముకలదు అక్కడకూడ కొందరుమర ణించినారు తోలుకట్టెలనుగ్రామములో ఇప్పు డిప్పుడే కలరావ్యాపించినది-కొందరుమరణించి నారు.

## దొంగమిలిటరీవేషాలు

హైతాలూకాలలోని కొన్నిగ్రామములలో, కొందరు మిలట్రీ సిపాయిలవేషములు వేసుకొని ఒంటరిగానడచు బాటసారులనుపట్టుకొని, నీవు యుద్ధమునకురావలెను, నీకుజీతమియిచ్చెదము అన్నముపెట్టెదము అనిచెప్పుదురట- ప్రజలువారికి భయపడి మేముయుద్ధమునకురాము అనిచెప్పుదురు అందుపైవారు మాకుసర్కారీ [ప్రభుత్వము] ఆజ్ఞయున్నది, మీరుసంతోషముగారాకున్నను, బలవంతముగానైన తీసుకవెళ్ళెదమని బెదిరించు చున్నారు అందుపై అమాయకులగుప్రజలుభయపడి సిపాయిలకుబతిమిలాడి ద్రవ్యములుఇచ్చుచున్నారు. ద్రవ్యముఇవ్వగానే విడిచివెళ్ళిపోవుదురు ఇట్టి వార్త అచేత పల్లెలలోనిప్రజలు చాలాభీతావహులైయున్నారు-

ఇట్టిసంఘటనయేనాకుగూడ సంభవించినది. ౨౧ వ షహరేవరు ఆదివారము కంద్వాడనుండి మక్కపురం (జాగీరు)బస్సుస్టేషనువద్దికివచ్చితిని, బస్సువెళ్ళిపోయినందున రోడ్డువెంబడివచ్చుచుంటి ని-సుమారు అయిదున్నరగంటలు సాయంకాలము కమల మామిడి మాయిదాబాదుఅవుస్యన (వికారాబాద హైదరాబాదురోడ్డు) ఒకమిలట్రీసిపాయివేషధారి సైకలుపైన నాకుఎదురుగా హైదరాబాదరోడ్డునుండి వచ్చుచుండెను

నన్నుచూచి సైకలుదిగినాపేరు, గ్రామము, వృత్తి అడిగినాడు-తర్వాత నీవు ఫౌజుమిలటరీలో నౌకరువుండెదవా యనెను. నేను ఉండనంటిని. అందుపైఅతడు నీవుసంతోషముగా ఒప్పుకొననున్నను బలవంతముగానైన సమీపములోయున్న మాదొరవద్దికితీసుకవెళ్ళెదనెను నేను రానంటిని వారికి నాకు కొంతసేపు వాగ్వివాదము జరిగెను-అందుపైనిసాయి క్రోధావిష్టుడైనాడు నేను మరలమెత్తనిమాటలచే మందలించగా వారునాకుఈవిధముగాచెప్పిరి, ఏమనగా నేనుమిలట్రీసిపాయిని-నేనుకాక ఇంకాచాలామంది సిపాయిలము ఈచుట్టుముట్టుపల్లెలవెంబడి తిరుగుచున్నాము-మాకు ప్రభుత్వమువారియాజ్ఞయున్నది-యెవ్వరైన పదహారుసంవత్సరములనుండి నలుబదిసంవత్సరములవరకు ఈడుగలిగినవారు మాకు అగుపడినయెడల మేముమా(క్యాంపెను)దొరవద్దికి తీసుకవెళ్ళవలయును-లేకున్న వారు జీతము లుఇచ్చెదరు-మరియుశిక్షయిచ్చెదరు- మాదొరయిక్కడ సమీపములో మోటార్లు యుక్తముగా యున్నాడు- నేను ఈచుట్టుపట్లగ్రామములు అనగా (దోసవాడ, వెంకటాపురం) మొదలగునవి తిరిగినాను-ఇంతవరకునాకు ఎవ్వరుఅగుపడలేదు- నీవుఇప్పుడు నాకుఅగుపడినావు- కావున నావెంబడి మాదొరవద్దికిరమ్మనియనెను- మరలనేను రానని నిరాకరించితిని-దౌర్జన్యముచేసి నావద్దయున్న జేబులోనుండి యెనిమిదిఅణాలు తీసుకొని వెళ్ళిపోవుచుండగా నేను వారిసైకలు సీటు పట్టుకొనియుంటిని-సైకలుసీటుక్రింద అతనిసైకలు బల్లియా లభాయి హైదరాబాదునంబరు చూచుకొని వ్రాసుకొంటిని- సైకలు సఫాయి నెంబర్ [౧౬౯౦౨] పదహారువేల తొమ్మిదివందల రెండు- [illegible] ౧౩౫౦ ఫసలీ-

తర్వాత మొహిదాబాదకువచ్చి రోడ్డుపైనయున్న పోలీసుమరియు బస్సుకొరకు ఎదురుచూచుచుఅక్కడయున్న వారికి చెప్పితిని-పోలీసు మాకుఈగొడవతెలియదు వెళ్ళిపొమ్మనియన్నారు- అప్పుడేఒకచిన్న టూరింగు మోటారుటెక్సి వచ్చినందున అందులోయెక్కి హైదరాబాదుకు చేరినాను-

దాత్రిక్ ప్రేంరాజయ్య



# ఆయుర్వేద సహాయం

లోకల్ఫండునుండి కావలెను.

నల్లగొండ జిల్లా రైతులు, వైద్యశాఖా మంత్రికిచ్చుకొన్న మహజర్

నల్లగొండజిల్లా ప్రజలు వైద్యశాఖ మంత్రిగారి కిచ్చుచున్న ఒకమనవిలో ఇట్లున్నది -

నల్లగొండజిల్లాకుచేరిన గ్రామప్రజలమైన మేము వినయపూర్వకముగ మనవిచేసుకొనుటయేమనగా- మ-హు-వ-నిజాంప్రభుత్వమువారు యీరాష్ట్రములో పాశ్చాత్య యునానీ వైద్యాలకుగాను సర్కారునుండియు, లోకల్‌ఫండు నుండియు సహాయం చేయుచున్నారు- యునానీవైద్యాలకుప్రతిసంIIరం లక్షలకొలది ద్రవ్యము సర్కారునుండియిచ్చుటయేగాక లోకల్‌ఫండునుండి కూడ ద్రవ్యసహాయం చేయబడుచున్నది-

ఆదేవిధంగా ప్రతితాలూకాలో లోకల్ఫండు నుండికొంతద్రవ్య ఆయుర్వేదానికిప్రత్యేకించిన ప్రజలకు చాలా ఉపయోగకారిగా నుండునుకావున యీదీవలపైన ప్రభుభక్తిపరాయణులైనప్రజలు వినయపూర్వకముగ మనవిచేయునదియేమనగా, ఆయుర్వేదానికికూడ లోకల్‌ఫండునుండి ద్రవ్యసహాయమును తొందరగా యేర్పాటు చేయించుచు ఇప్పుడిచ్చినద్రవ్యసహాయములో యెక్కువచేయవలెనుఅని ప్రార్థించుచున్నాము

[సుమారు ౩౦మంది సంతకాలతో పంపబడినది గో-ప-]

## మానుకోటలోకలరా

[విలేఖరి] ౨౫-౭-౧౯౪౦

మానుకోటగ్రామములో సుమారు ౧౫ రోజులనుంచి కలరావ్యాప్తిఅగుచున్నది- చుట్టుపట్టు గ్రామాదులలో కొలదిగాకలదు- స్థానిక డాక్టరుగారు విరామములేక కలరాఇంజెక్షనులు బజార్లు తిరిగిఈయుచున్నారు-

### భజనలు

మానుకోటలో కలరావ్యాధివలనజనులుభజనలుచేయుచున్నారు-మహమ్మదీయులు మసీదులకువెళ్ళి నమాజుచేసి [illegible]చున్నారు- యీదాహార్మయ్యగారు [illegible] ప్రోత్సాహమువలనహిందువులు [illegible] (తిఅంటిగంటవరకు భజన చేయుచు [illegible]చున్నారు-

దా [illegible] గారిద్వారా

[illegible] ఆత్మీయుచితముగ రెండుపుట్లధాన్యము పంచిపెట్టిన మ-రా-శ్రీ రావులరంగారెడ్డి దేశముఖుగారు అంగీకరించినారు-వారికి ఎంతయో కృతజ్ఞత-

### శ్రీకృష్ణగ్రంథాలయము

గ్రంథాలయఎన్నికలు ఒక నెలరోజులక్రింద జరుగవలసియుండెను- ఇంతవరకుకూడ జనరల్ బాడీ మీటింగుచేయు సూచనలు కన్పించుటలేదు-

# మేతలులేక పశువులు చచ్చుట ధరలు పెరుగుట

కామారెడ్డి తాలూకా

హైతాలూకాలోనిఈసావగరంపుపరిసరగ్రామస్థులు సుమారునూరుమంది సంతకాలుచేసి కామారెడ్డితాలూకా తహసీలుదారుకు తమ గ్రామములోని స్థితిగతులను మొరపెట్టుకొన్నారు. దగరనే ఉండే బీబీపేటనుండిఆడేగ్రామస్థులు ధాన్యాకు లనుకొందరు అచ్చటిజనులు మేతలు విపరీతధరలకమ్ముచున్నారు గ్రామములోనిపశువులు మేతలులేక చనిపోవుచున్నవి, వర్తకులుధాన్యాదులధర విపరీతముగాపెంచినారు ఈకష్టము ప్రభుత్వమువారుతొలగించవలెను అనిరైతులు మొరపెట్టుకొన్నారు,

## చందాదారులకు మనవి

చందాదారులు మా కార్యాలయమునకు జాబులు వ్రాయునపుడు, మనిఆర్డర్లు బంపునపుడు తమ చందానెంబరు వ్రాయుటయందు తగుశ్రద్ధ తీసికొనుటలేదు చందా నెంబరు వ్రాయనిచో వెంటనే జవాబీయుటకు వలనుపడదు కావున చందాదారులెల్ల ముఖ్యముగ గమనింపకోరెదము.

మేనేజరు, గోలకొండపత్రిక

# హరిజన వాడలో మ్యాజిక్‌లాంతర్ ప్రదర్శనము

గోపాలుపేట ౨౪-౭-౪౦.

నేటిరాత్రి శ్రీయుత ఏ- చెన్నకేశవులుగారు (రాత్రిపాఠశాలఉపాధ్యాయులవారు) హరిజనవాడలో మెలుకువ, పరిశుభ్రత, మద్యపాననిరోధము గూర్చి మ్యాజిక్ లాంతరుచిత్రములుచూపించిరి. ఆసందర్భములో ప్రతిచిత్రమును చూపించుచు ఈక్రిందిరీతి గాయుపన్యసించిరి- మనుష్యుడు ఆహారము, నీరులేకున్నను కొన్నిరోజులవరకు బ్రతుకగలడుగాని శుభ్రమైనగాలిలేక కొన్ని నిముషములుకూడ బ్రతుకలేడనిరి- మనము ఎలుగులు పులులు నివసించులాటి గుహలవలెనుండు చీకటిగదులలో నివసించుచున్నాము వాటిలోనికి వెలుతురు గాని పరిశుభ్రమైనగాలిగాని ప్రవేశింప నేరదుగాన అరీతిగానివసించుటచే అనారోగ్యమునకునుసముతొందరగా లోబడి రోగములపాలౌదుమనిరి- పశువులకొట్టు ప్రత్యేకంగాఉండి వెలుపలి మంచి గాలివచ్చు ప్రదేశములోకట్టించవలయుననియు వాటిపేడగొబ్బు ప్రతిరోజు తీసివేసి ఆప్రదేశముపరిశుభ్రముగా చేయవలయును- ఇట్టిజంతువులపెఇండ్లలోకట్టుకొనిన దోమలు, ఈగలువృద్ధిపొందిరోగములు తెచ్చునవిరి ఇంటిప్రక్కలలో పెంటలుగాని చెత్తగాని చేర్చుకూడదు.దానివల్ల గాలిచెడిపోయి తొందరగా రోగములురాకలున్నదనిరి- స్త్రీలు వండినపొయ్యని శుభ్రముగానుంచి తినుబండారమును ఎప్పుడుమెప్పటనుంచవలెయునో వాటి ఆయాస్థానమునందుంచి ఎలుకలుగాని, ఈగలు, పురుగులు, దోమలు గాని చేరకుండా అన్నియూతలుంచవలయునని చిత్రము చూపించుచుచెప్పిరి- మలేరియా,కలరా,ప్లేగుమొదలగురోగాలు ఏయేపురుగులవల్లవచ్చునో చిత్రము చూపిస్తుబోధించిరి, మద్యపానపుచిత్రములుచూపిస్తుదానిమహిమవల్లపోట్లాడి దెబ్బలుతిని బాధపడుటయు, దొంగతనము చేసిజైల్లోపడటము, తమ భార్యల మెడలలో పుస్తెలుగూడ త్రెంచికొనిపోయి త్రాగిరావడం దీనివల్లఒళ్లుచిక్కిపోయిన క్షయరోగములుకలుగడం ధనముగోల్పోయి ఇల్లిల్లు భిక్షమెత్తుకొనుచుతిరుగడము మొదలగునష్టములను బోధపరుస్తు కొందరితో ముందు కల్లుత్రాగమనిప్రమాణము చేయించిరి-గోవుమాంసముతో సమానమైనది, దానినికొందరుహరిజనులుగూడనోనే మాంసముతినుచున్నారు ఈరీతిగాచేయుట మనలనుతొమ్మిదినెలలవరకుమోసి, పాలిచ్చిపెంచిపెద్దవానిచేసిన తల్లినిచంపి ఆ మెమాంసముతిన్న దానితోసమానమనిరి-

ఇట్లు
హరిజన విద్యార్థి

# బచ్చలికూరకూడా దొరకుటలేదు

వర్తకదారుల బెదరింపు

కొత్తపేట(తాII సుల్తానాబాదు)లో ప్రజలు విద్యావిషయంలో చాలాకాలమునుండి ప్రయత్నంచేస్తు [illegible] ఇంతవట్టుకువారికి ఎటువంటి [illegible] లేదు ఇక్కడసర్కారి ఉన్నా బీదరైతులేమాత్రం చదువుకొనటానికివీలులేదు ప్రొద్దున్నవారి వారివ్యవసాయపుపనులు మరికూలీలపనులు చేసుకుంటు జీవనముగడుపుకుంటారు వారికిపగలుచదవటానికివీలులేదొరకదు. వారికి రాత్రిపాఠశా-లయెక్కువఅవసరముకావున మొన్న నే మంగళవారం [illegible] సరికి [illegible] నాడురాత్రి పాఠశాలప్రారంభంచేయబడినది పిల్లలుపెద్దలు ఉత్సాహంగావచ్చుచున్నారు ఇట్లువారు ౫,౬దినములువచ్చేసరికి ఇక్కడివర్తకదారులు బీదరైతులనుభయపెట్టుచు మరియుపాఠశాలకుపోయినయెడల [illegible] రి ఈకారణంవలన అక్కడినుండిపిల్లలసంఖ్యతగ్గను కానిమళ్లీనేనుఅక్కడికివెళ్లి అక్కడిరైతులకు దీనివిషయంమీరు భయపడవలసినఅవసరములేదు విద్యావిషయములో సర్కారువారుమీకుఎటువంటిశ్రమకూడనివ్వరు రాత్రిపాఠశాలలవిషయం ఎటువంటినిర్బంధముగూడలేదు ఈబెదరింపులు తమస్వలాభముకొరకేఅనిచెప్పగా మళ్లీమొదలవచ్చినపిల్లలందరు వచ్చుచున్నారు ఇక్కడినుండివారు త [illegible] ండాప్రతిదినమువస్తామని వాగ్దానంచేసినారు. తాముకాకఇతరులనుగూడ తమవెంటతీసుకవస్తామని చెప్పినారు.

ఈగ్రామంలోనూరియు యీచుట్టుపెట్టుగ్రామములలోక్రిష్నారావుపేట,గోడిశాలపేట,షైరిపల్లి, ముత్తునూరు, రాంపూరు, క. రావుపేట, అంబారిపేట, ఎండపల్లి సుంకెపల్లి తదితర సమీపగ్రామాలలో మొదటికార్తులలో కొద్దివర్షాలు పడుటవలనను ధనాసవిత్తులుచల్లినారు కానిఅంతరోజులనుండి వర్షంఏమాత్రంలేనందున ధనాసవైరులుఎండిపోతున్నవి గొడ్లకుమేతలులేక దుమలమాడుతున్నవి బీదరైతులు తిండికిలేక నానాఅవస్థలపాలగుచున్నారు ఇంతవట్టుకు సాహుకార్లు బీదరైతులకు ధాన్యముబదులిచ్చి అపారమైనపెచ్చుతీసుకొని తమగరిసెలునింపుకుంటువచ్చినారు-కాని ఇప్పుడుఆపెచ్చులకుకూడ ఎవ్వరుఇవ్వడంలేదు రూపాయిలు తెచ్చినఇచ్చుటలేదు కొద్దిమందిఇచ్చినా ధరలుచాలాపెంచుచున్నారు-ఈగంటకున్నధర ఇంకోగంటకులేదు ఈకారణాలచేత పెక్కుమందిరైతులు బచ్చలికూర తదితరఆకుకూరలుతిని జీవనముగడుపుకుంటున్నారు కానిఈఎండలకు ఆకుకూరలుకూడకరువవుతున్నవి. దయామయుడగు ఈశ్వరుడు ఎట్లుతీర్చగలడో తెలియదు-

## దిక్కులేని చావు

వైశ్యశవాన్ని విజాతి కూలీలు మోసివేయుట

మానుకోట వరంగల్ జిల్లా.

మానుకోట గ్రామములో ఒక వారంరోజుల నుండి కలరా యుండెను. ఈలోపల ఒక వైశ్య యువకుడు, అనగా వైశ్యయువజనసంఘములోని మెంబరు అకాలమరణమునకు గురియయ్యెను. ఈ గ్రామంలో ౩౦ వైశ్యకుటుంబములుండినను పాప ము-ఒక్కరైనను శవముదగ్గరకుపోలేదు. చివరకు యువజనసంఘము వారిలో తమతమ గృహముల యొద్దనుండి శవముదగ్గరకువచ్చిన వాడొక్కడును లేడాయెను. ఇట్టులనేకమంది స్వకులమువారుడుం డియు కలరాభీతిచే వృత్యువునకుభయపడి తమతమ గృహంబులలోయుండి శవదహనముచేయక ఒక డు కాకులచ్చిరాదని, మరొకడు నాకుజబ్బుగా నున్నదని ఇంకొకడు మాతల్లిదండ్రులు వద్దన్నారని యు ఈలాటిపన్నాగములచే వైశ్యులెవ్వరును శవదహనముచేయకుండిరి. తుదకుపాపము ఈ గ్రామమునకే పద్మశాలీ సంఘమువారు అట్టిశవ మును తీసిపోవ కొంచిరికాని వారికికూడా నదరు వైశ్యులే కొన్నికొన్ని యాటంకములు కల్పించిరా రట. చివరకు హమాలీలకు ౧౦౦రూపాయిలిచ్చిర ట్లు. పాపము ఆచనిపోయినయువకునితండ్రి దిక్కు లేక-బహుదుఃఖముచే ఈ గ్రామములో వైశ్యు లెవ్వరునులేరా, లేరాయని అరచిఅరచి అట్టిశవ దహనము చేయించుకొనెనట.

---

### యుద్ధనిధికై "మధుసేవ" నాటక ప్రదర్శనము

రాత్రి ౧౦॥ గం నుండి ౧౦॥౪ ల వరకు

(స్వ.వి) నవపర్తి ౨౪-౭-౪౧

"శ్రీ ఆంధ్రమిత్రమండలి"వారు రైల్వే బస్ స్టాఫ్‌వారు అందరు సికింద్రాబాదవారుకే కాక పోయినను పీరీసైజాంట్రైటులో "యుద్ధనిధి"యను సాకతో ప్రదర్శించి దబ్బు సంపాదించువారు

డ్రామాకువచ్చేవారు ఎన్నికరూకొరణాలమట ట్టికెట్టుడు. కొందరుబడాయిగా సినిమాస్టారని డ్రామాకొన్న పేర్లుబట్టి పోనుపోయి,కొందరు సీను_సీనరీలు చూద్దామని,కొందరు మిత్రులప్రోత్సాహ మున, కొందరు తమబలాయిని కనుపరుద్దామని, కొందరు డ్రామాలోని స్త్రీలను చూద్దామని కొం దరుబలవంతముగా కట్టినట్టికట్టనటీనికొని విధిలేక వచ్చువారు. కొందరు తమ ప్రియురాండ్రను సంత సింపజేయుటకై వచ్చువారు ఈరీతిగా ఎంతకో ఎన్నిరూకొరణములవల్ల వచ్చుచుందురు-విమర్శ పూర్వకముగా నాటకకళను గ్రహించి, నటకుల, నటీమణుల లోపాలోపముల నటనలోగాని, గా నములోగాని సూత్రధారుగురువిమర్శకులు ఎందరుకుం డుకూడ ఈడ్రామాచూచుటకువచ్చినవారిలో దొ రకుటయరుదని వాయూహ- టైపిమర్శకుల నా యభిప్రాయమునుబలపరచి వారితో ఏకీభవింతురని నమ్ముచున్నాను-ప్రకటనపత్రికలో మిస్-శ్రమంత కమణి "నిర్మల" పాత్రధారిని యని తెనుపరచి మిస్ డి-వి-రత్నమును పాత్ర వేయించివారు. మిస్-శ్రమంతకమణి క్వాంటంటలో సహా పిక్చరులో నటించిన యువతీమణి. ఈమెపాట, పద్యము చెప్పుశైలి, మణిశరీరముబాగుగాయున్నది- అట్టి నటీమణీమారు, రత్నముతో ఆపాత్ర వేయించి ప్రేక్షకులను మోసముచేసినారు-

ఈతంద్రామా పామరజనరంజకముగ ఉండినది- కాని ఆంగ్లము రాని పల్లెలవారలే చాలావచ్చినారు,సంస్థానములవారున్న కొద్దివారే చాలావరకు ప్రేక్షకులకు కథయే బోధపడలేదని చెప్పుకొనగావిన్నాను-ఈలాటి సాంఘికడ్రామా లు ఎన్నడూ చూచియుండరు-కావున ఆంగ్లము లో నుచ్చరించినభావమును ఆంధ్రములో గనుప ర్చవలయును.

---

## అనావృష్టివార్తలు

వర్షములేనందువల్ల పునాసపైరులు మాడుచు న్నట్లును, పశువులకు త్రాగునీరు మేతలేక అవిల ల్లాడుచున్నట్లును వార్తలు హుజూరునగరం తా లూకానుండియు, మహబూబునగరం జిల్లాలోని రాయిపాకుల, బండపల్లి, అనంతసాగర పెద్ద పల్లిగ్రామాలనుండియు, బూతుకూరునుండియు నల్లగొండజిల్లాలోని నారాయణపురం సంస్థానం లో పశువులకొరకై అడవులనుండి ఆకులుతెచ్చు కొని ఎండిన అటవిశాఖోద్యోగులవల్ల అటంకము లు కలుగుచున్నవట. మరి గతిఏమిఅనిఅడుగుచు న్నారు

---

## సిద్దిపేట

ఇంతవరకు కిచ్చుట వర్షములులేవు

అవ్వలుతాలూకుదారుగారు మెహతేమాం అ ప్కారీమరియు మద్దాదుబ్బాకారగారలు అప్కారీశెలములపను నుమన యీసిద్దిపేటకు విజయ ముచేసియుండిరి,ఈప్రాంతియాక్లట్ చాలాకాలము నుంచి జీర్ణాస్థితిలోయుండినది. మనుష్యులకుమా రుగా పశువులునివసించుచుండెను. అట్టిశీర్ణస్థితి ని రూపుమాపినవారు సయ్యద్ ఆలీమహమ్మదు ఆగామీర్జా తహశీలుదారుగారు యీతాలూకా కువిజయంచేసినతరువాత వారితహశీలుపదవికి విజ యముచేసినసుంచి వారికచ్చేరీస్థితిని బాగుపరచుట యేగాక తెలకొండిమిషక్కరియొక్క పరిష్కార ములుచేసియున్నారు వారి ఉద్యోగకాలములో క్లబ్బుయొక్కస్థితి- ప్రవతిస్నత్యుత్కృష్టమైనది కొద్ది కాలములోనే క్లబ్బుయొక్క అవరణమున్ను గద్దె యలుమరియు వివిధమయిన సౌకర్యము కల్పించు టయేకాక రేడియోయంత్రమునుస్థాపించుటకొర కై పాటుపడి వకీలుజిల్లామరియుకొందరి సహా యముచే మిక్కిలివిలువగల రేడియో రెండుబ్యాట రీలది తెప్పించిరి- రేడియోయొక్క ప్రారంభో త్సవము నవాబుఅబ్దుల్లాఖాన్ సా॥ జాగీరుదారు మరియుఅవ్వల్ తాలూకుదారు (మెదకు)గారి అ ధ్యక్షతనజరిగినది. అట్టిఉత్సవములో మహమ్మదీ యులు హిందువులు పాల్గొనిరి.

---

### సదాశివపేటలో వితంతువివాహము

విలేఖరి)

౨౭-౭-౪౧

నేడు ఆర్యసమాజమందిరములో సాయంత్రం ౧౦. ౪౫నుండి ౧౧ ౯ వరకు వితంతువివాహము అత్యుత్సాహముతోజరిగెను వరుడు శ్రీమార్క టుకం రాములుగుప్త గారు సదాశివపేట, వయస్సు ౩౦, వధువు శ్రీమతి లక్ష్మమ్మ రాంబాదేవి గారు కోహిర్ వయస్సు ౧౫.

ఈవధూవరుల వివాహమునందు జనసమూహ ము ఎక్కువగ యుండెను సుమారు ౩౦౦ మంది వందలు వివాహములో పాల్గొనియుండిరి.శ్రీశం కర దేవుగారు యిట్టిశుభకార్యము వైదికరీత్యా అ ర్థసంయుక్తముగ మంత్రోచ్చారణచేయుచు మి గుల ప్రభావముతో యిట్టి గంభీరకార్యము నొనర్చిరి.

---



మనోహరమైన

వెంట్రుకలకుగాను

ఈ పేరొన్న బ్రిలియంటైన్

ఉపయోగించుడు



మీ ఇతరకేశ సౌందర్యోపకరణములు ఏవియన సువాసనయుక్తమైన నారికేళకేశతైలం, కొబ్బరి నూనె షాంపూ. వైసాధకములు, లైమ్స్ అన్దు గ్లిసరిన్, గొప్ప అంగళ్ళలోనెల్ల దొరకును. ఎల్ల ప్పుడు దొరకుస్థలము.

టాంకోసేల్స్ డిపార్టుమెంటు

మగ్రూబ్ బిల్డింగ్, ఫత్తె మైదాన్, హైద్రాబాదు ద.

---

## శ్రీవైష్ణవ శ్రీకృష్ణ జయంత్యుత్సవము

భాద్రపద కృష్ణాష్టమీ రవివారమే యుక్తము

సింహసంక్రమణములో రెండు నక్షత్రములు వచ్చినను, వీటిలోనొకటి శుద్ధముగా లభించు చున్నందున, నక్షత్రప్రాధాన్యముగల తెంగలవా రు, గౌణముగాచెప్పబడిన భాద్రపదమాసములో గల మృగశిరాసహితాష్టమి దినమున జయంత్యు త్సవము నాచరించుట సాంప్రదాయ విరుద్ధమని యు శ్రావణకృష్ణదశమి రవివారరోహిణ్యుపక్ష తదినమునం దాచరించుట యుచితమనియు అచ్చి వారు వ్రాసినారు

తెంగలవారికిని ఆళ్వారాదుల తిరునక్షత్రము లవలె శ్రీకృష్ణజయంతి కేవల నక్షత్రప్రాధాన్య ముకలదికాదు అటులైనచో తిథికిబూర్వమున రోహిణీనక్షత్రము శుద్ధముగానుండినను సప్తమీ విద్ధాష్టమీతిథియందున్నను, నక్షత్రప్రాధాన్యము నుబట్టి యీ వరింపవలసియుండును-తిథినక్షత్రోభ యప్రధానమయినది కావుననే సప్తమీవిద్ధయయి నయష్టమియు, కృత్తికావిద్ధయగు రోహిణియు, త్యాజ్యములని వేరువేరుగా దోషములు చెప్పబడి యున్నవి.సప్తమీవేధయష్టమికేగాని,రోహిణీనక్ష త్రమునకుకాదు-"అర్కవిద్ధాష్టమీత్యాజ్యా"అని ప్రమాణముగలదు- సూర్యోదయమున తిథినక్షత్ర ములు రెండు దూషితములు గాకయుండుట యు క్తమను-నక్షత్రము దూషితముగునప్పుడు"మృగేణ సహితాష్టమీ" అని మృగశిర యుక్తాష్టమికే ప్రాధాన్య మివ్వబడినది- నిర్దుష్టతిథి సాహచర్య ము లభింపనప్పుడు "నవమ్యాంవాదశమ్యాం యు దిరోహిణీ"అని నక్షత్రమునకే ప్రాధాన్యమివ్వబ డినది-తిథినక్షత్రములు రెండుదుష్టములయినప్పుడు "మృగేణచదశమ్యాం చయుక్తాగాహ్యాతిశైష్ణ వై"అని మృగశిరాయుక్తదశమియందాచరింపవల యునుగాని దోషదూషితములు కూడవు.

ప్రస్తుతము ప్రథమనక్షత్రమునకు ద్వితీయనక్ష త్రమె ప్రతిబంధకము "ఏకస్మిన్నేవ సంక్రాంతౌ యదాబుతద్వయంభవేత్। ఉత్తరేతుప్రకర్తవ్యం జయంత్యారాధనంనృప" అనికలదు ఉత్తరనక్ష త్రము సప్తమీమష్టమీగతమయి, లేక తిథిపూ ర్వగతమయ్యేని మృగశిరాయుక్తాష్టమియే గ్ర హింపవలయును "ఉత్తరేయదివిప్రేంద్ర సప్త మ్యాంయది,రోహిణీ మృగేణసహితాష్టమ్యాం జయంత్యారాధనమురు"అని ప్రమాణము కలదు పూర్వనక్షత్రము సంక్రమణాదిదూషితమయిన, పూర్వనక్షత్రము నాదరింపవలయునను ప్రమాణ మునుసరించిన, శ్రావణ మాసములోని రోహిణీ నక్షత్రమందునసే సింహసంక్రమణ ప్రవేశమయి నందున సంక్రమణాష్టమయినది- పూర్వదినమున నక్షత్రస్పర్శయున్నను రెండవనాడునూర్యోదయ గతరోహిణీ శుద్ధమని యెంచరాదు సంక్రమణ స్పర్శ నక్షత్రమునకు దోషముగాని కృత్తికాస ప్తమీవిద్ధాదులవలె "సూర్యోదయేవాపూర్వేవా" యనునట్లుకాదు. నిర్ణయతినిబట్టిలేదు-నక్షత్రమునకు సం క్రమణస్పర్శకానప్పుడును నిశీథమునకు లోపుగా ప్రవేశించెనేని, సంక్రమణవిద్ధయగునని చెప్పబడు టచే సంక్రమణస్పర్శ నక్షత్రమునకయ్యేనేని వేధ యనితెలుచున్నది ఈవిషయము-"అర్ధరాత్రి దధ స్తాచ్చేత్సంక్రమేద్య దిభానుమాన్। బుక్షస్పర్శా ద్యథాశేషవిద్ధేత్యాహుర్మనీషిణః" అను ప్రమాణ మునగలదు-కావున రెండవనక్షత్రముసప్తమీవిద్ధా ష్టమీయుక్తమగుటవలన పూర్వనక్షత్రము సంక్ర మణదుష్టమగుటవలన భాద్రపదమాసమునగల మృ గశిరానక్షత్రయుక్తాష్టమీరవివారమే కృష్ణజయం త్యుత్సవోచితదినమని ప్రమాణశేత్తలుగ్రహింతురు గాకయని విన్నవించుచే విరమించుచున్నాడను-

ఇట్లు

శ్రీ కృష్ణమాచార్యులు

శతావధానులు బండలింగాపురము,

నమస్తే

---

### హరిజనులకు- అన్నదానము

హుజూరునగరం తాలూకాలోని పత్తేపురము లో మా శ్రీ మాధవరావు గారు మల ములమాడుచున్న హరిజన సోదరులు నాలుగుమందికి తమకేలగిరిజాగులో వంటలుచేయించి భోజనములుపెట్టించినందున వారికుటుంబమున కు ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధికై పరమాత్మ ని ప్రార్థించుచున్నారము-

ఇట్లు

పత్తేపురం హరిజనులు

---

# సమకాలికాభిప్రాయములు

## ఛత్తారీనవాబుగారు

రహబర్ దక్కన్ పత్రికలో ౨౩ షహారేవరు నాటి సంపాదకీయములో నవాబుఛత్తారీ గారిని మ-ఘ-వ- నిజాంప్రభువు గారు హైద్రాబాదురా ష్ట్రప్రధానమంత్రిగా ఏర్పాటుచేసిన ఫర్మానును విపులముగా ఉదహరించుచు ఇట్లభిప్రాయమి చ్చినారు

నవాబుఛత్తారీగారు యూపీలో గవర్నరు మున్నగుపదవులను నిర్వహించినవారని మ-ఘ-వ- ప్రభువుగారు చూపిచెప్పుటలో వారిగొప్పతనమును ప్రజలకుచూపిం చుటకై చెప్పబడబడినదనుకొనవలెను- ఛత్తారీన వాబుగారికి చాలాగొప్పఅనుభవమున్నది, గొప్ప ఉద్యోగాలు బ్రిటిషుఇండియాలో సాధారణజను లకులభించవు,

ఛత్తారీనవాబు గారి సుగుణాలనుగురించి మం చిఅభిప్రాయాలు వినవచ్చుచున్నవి వారుఖురాను యొక్క హాఫీజ్ అయియున్నారు (అనగాఖురా నుబాగాకంఠపాఠము చేసినట్టివారు) దైవభీతికల వారు, తమమతపూజను ఏప్పుడున్నూ మరువనట్టి వారు, మన పధానమంత్రికి మనదేశాచారాలు ప్ర భుత్వపద్ధతిగ్రహించి మనఅంతరంగిక పరిపాలనా న్ని నడుపించుటగొప్పకష్టముకాదు.

మనప్రధానమంత్రి గారికి ఉద్యోగవ్యవహారాని కి ఇంకకెలమీదకొన్నిదినాల గడుపున్నవి,ఈకా లములో వారు ఇక్కడప్రత్యేకపరిస్థితులను గమ నించగలరు, ప్రక్కరివారినుండి తదితరులనుండి యు విషయాలుతెలుసుకొని సరియయినమార్గము లోనడువ గలుగుదురు.

## ప్రధానామాత్యపదవి

మల్లుకత్ అనుస్థానికఉర్దూపత్రికలో హైద్రా బాదు ప్రధానామాత్యుని నియామకమునుగురించి ౨౦-౧౦-౫౦ నాటిసంపాదకీయములో హైద్రా బాదులో పగలు-ధికారమెంతకాలం! అనుశీర్షిక తో ఇట్లువ్రాయబడినది-అందరున్నూ హృదయ పూర్వకముగా రాష్ట్రములోని అర్హుడగువానిని ప్రధానామాత్యపదవిపై నియమించితే బాగుం టుందనికోరినారు- ఈవిషయంలో అన్నిమతాల వారును వర్గాలవారును ఇదేకోరినారు-నిజాం ప్ర భువుగారికిన్నీ ప్రముఖులు తంతీయిచ్చినారు... హైద్రాబాదులోని ఉన్నతోద్యోగములపై బయ టివారినియామకం రాష్ట్రములోని ఉత్తములకు ఉత్సాహభంగకరమైయున్నది- ఈనిరుత్సాహము అట్టివ్యక్తులకేకాక సంఘానికంతయు కలుగుచు న్నది "మాలోఉత్తములనే విచారించేవారెవ్వ రప్పుడు ఇకమాకేమిమేలుకలుగుతుందని ఆశపెట్టు కోవలెను"అని ప్రజలనుకొందురు-

పరులపాలబడుటచావుతోసమానం- జ నులభావాలు రాష్ట్రీయులకుతెలిసినట్లుగా బయటి వారికేమితెలియును- రాష్ట్రీయులకు తమవారిపై కలఅభిమానము బయటివారిపైఉంటుందా? ఉండును?

కొత్తాపూరు

కొత్తాపూరులో సంభవించినకలరా వ్యాధిని గురించి విచారించుటకు సికింద్రాబాదు సనాతన సంఘమువారు అచ్చటిచుట్టుపట్టు గ్రామాలలో పర్యటనచేసి విచారణచేసి ప్రభుత్వానికినివేదికను సమర్పించుకొన్నారు.

---

## మ. ఘ. వ. ప్రభువుగారి జన్మదినోత్సవములు

మ ఘ వ నిజాంప్రభువుగారి జన్మదినోత్సవ ములు జిల్లాలలోపలుచోట్ల ఈనెల ౧౪-౧౫ వివారంనాడు జరుపబడినట్లు వార్తలువచ్చినవి-

ఆందోలుతాలూకాలోని కొదురూబాదులో ప్రభుత్వపాఠశాల ప్రధానోపాధ్యాయులవారు ప్ర భువుగారిఫోటోనుపెట్టి పిల్లలతోపాటలు పాడిం చి, తుదకుపిల్లలకుమిఠాయి పంచిపెట్టిరి

సికింద్రాబాదులో సనాతనధర్మ మహాసభప క్షమున పరిదేవాలయమునందు మ-ఘ-వ- ప్రభు వుగారి ఆయురారోగ్యాభివృద్ధికొరకై అర్చనలు జరుపవలసినదిగ విజ్ఞాపనపత్రము ప్రకటింపబడి నది ఆసాయంకాలము సనాతనసభఆఫీసుకందు ప్ర భువుగారిపటమును పూలచేఅలంకరించి ప్రభువు గారిఆయురారోగ్యాలకై ప్రార్థనలుచేయబడినవి

---

కొత్త ఇండ్లు

హైదరాబాదు దక్కన్,షహారేవరు ౨౬

హైద్రాబాదునగరములో బషీరుబాగవద్ద కోర్టు ఆఫ్ వార్డుపక్షాన సుమారు రెండు లక్షలు వ్యయముచేసి కిరాయిఇండ్లుకట్టుచున్నారు

---

## హైదరాబాదు వర్తక సంఘము

(విలేఖరి)

హైదరాబాదు(దక్కన్), షహారేవరు ౨౧

ఇక్కడ నిన్నమధ్యాహ్నము రెండుగంట లవేళ హైదరాబాదు వర్తకసంఘముయొక్క కార్యవర్గసమావేశము రాజాటక్సీలాల్ మోతిలా లుగారియింటిలో పన్నాలాల్ లాహుటీ గారి అధ్య క్షతనజరిగెను- ఈసమావేశమునకు ఈరాష్ట్రము లోనుండే ౧౦వర్తకసంఘాలు ప్రతినిధులను పం పంచుటకుకోరబడినవి, వరంగల్లునుండి శ్రీ కో దాటినారాయణరావుగారు మధిరనుండి మరియా అనారాయణగుప్తగారు, మహబూబునగరంనుండి ఏగూరు చిన్నప్పగారు వచ్చియుండిరి.

ఇకముందు అనాయపుపన్నువిధించుట ప్రభు త్వమువారికిగల తలంపువిషయమై చర్చజరిగెను- చాలదూరముచర్చతర్వాత అనాయపుపన్ను విధిం చవలదని ఒకవిజ్ఞప్తినిప్రానీ వర్తకప్రముఖుల సం తకాలుపొంది హై-ఎ- సర్ అక్బర్ హైదరీగారు ప్రధానమంత్రిగానున్నప్పుడే వారికి సమర్పించ వలెననితీర్మానించబడెను-ఇందుకై ఒకఉపసంఘ ము నియోగించబడినది-

---

## డాక్టర్ టాగూరిగారికి ఆపరేషను

డాక్టర్ రవీంద్రనాథ టాగూరుగారికి జులై౩౦వ తేదినఉదయము కలకత్తాలో అపరేషనుజరిగినది. అపరేషనుచేయనిచో వారిబాధ అంతకంతకు ఎ క్కువగుచున్నందున వారినికలకత్తాకు అపరేషను కైతెచ్చిరి- అపరేషనుకు టాగూరుగారుతాళగలి గిరి- జులై ౩౧వతేది ఉదయమునరకుకూడ వారిస్థి తిబాగుండెనట.

---

## మదరాసువారి యుద్ధసహాయము

జులై ౩౧వ తేదిన మదరాసు నగరములో అ క్క డి రా ష్ట్రీ య యుద్ధసంఘము ఒకబహిరంగసభనుజరిపెను. దా నికిజను ౬ చాలమందివచ్చిరి- గవర్నరుగారు ఆ సభలోఉపన్యసించుచు "ఇటీవల జరిగినవాటివల్ల భారతదేశానికి యుద్ధముఅనేకదిక్కులనుండి ఇ దివరలోకంటె సమీపతరమైనట్లు తెలియగలదు ... యుద్ధమునకై మీరు ఎవరిబలవంతముగాని లేకుండాచేసినసహాయము తక్కినరాష్ట్రాలవారు చేసినదానికంటెఎక్కువైనది- మీరాష్ట్రపుజిల్లా లలో తూర్పుగోదావరి గుంటూరు జిల్లాలు ౧౦ లక్షలలెక్కనువచ్చినవి"అనిచెప్పిరి-

---

## కాశీ హిందూవిద్యాపీఠ ఋణగ్రస్తత

కాశీ హిందూవిద్యాపీఠము అఖిలభారతదేశము నకును సంబంధించినదనియు ప్రతిహిందువున్ను దానినిచూచుకొని గర్వించదగిన విషయమనియు దానిపైప్రభుత్వము సరిగాశ్రద్ధచేయుటలేదనియు, అన్నితెగలవారలను చదువుకొనుటకు రానిచ్చునని యు, అట్టివిద్యాపీఠము ఇప్పుడుఅప్పులోపడినదని యు, అఅప్పుతీర్చుటకై రూ, ౨౦ లక్షలుకావ లెననియు, దానివసూలుచేసికొనుటకై తాను సంచారముచేయుచున్నాననియు, గాంధి మహా త్ముడు తనకృత్యమునకు విజయముచేకూరుగాక యని ఆశీర్వదించినాడనియు—జులై ౩౧వ తేది సాయంకాలము సర్. యస్. రాధాకృష్ణన్ గా రు అహమ్మదాబాదులో ఉపన్యసించుచుచెప్పిరి

---

### దేవీప్రశ్న

ఆయుష్యప్రశ్నలువ్రాసి కవరులోయుంచి సీలు వేసిపంపిన దేవీమహిమచే ఫలితములువ్రాసి మీకే శ్రీ కవరుసహా పంపుదుము రు 1-6-0 సం॥రఫలం నెలవారీ రు 1-12-0 వర్షలుగల పూర్ణజాతకం రు 5-8-0 శ్రీసరస్వతీజ్యోతిషాలయం,కాశీవాస.

సంవత్సరము చందా
5 హాలీ రూపాయిలు
ఆరుమాసాలకు
3 రూపాయిలు
బ్రిటిషిండియాకు
సం॥ చందా
5-8-0 లు
పాతపత్రికలకు
వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

The only
Popular Paper
That reaches
The masses
In the Dominions
Best Medium
for
Advertisement

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

Volume 16 | Hyderabad-Dn | Monday 4th August 1941 | Number 27


## అధినివేశ ప్రతిపత్తి అమలు ఎప్పుడు?

### బ్రిటిషు ప్రభుత్వమునకు ఏపార్టీకిచెందని నాయకులప్రశ్న

జూలై 31వ తేదిన పూనాలో ఏపక్షానికి చెందని నాయకుల మహాసభ సర్ తేజ్ బహదూర్ సప్రూగారి అధ్యక్షతలో జరిగినది. అధ్యక్షోపన్యాసంలో వారు ఇప్పుడు క్రొత్తగా వైస్రాయి మంత్రివర్గసభ్యులుగ నియుక్తులైనవారలు జైళ్ళలో నుంచు వెలకొలది దేశీయులనువిడిచి దేశంలో శాంతపరిస్థితులను నెలకొల్పుటకు యత్నించవలెననియు, కాంగ్రెసువారడిగిన ప్రకారము భారతజాతీయ మంత్రివర్గమును స్థాపించుట కష్టసాధ్యము కానిదనియు, ఎందుకనగా ఆమంత్రివర్గము యుద్ధకాలములో సార్వభౌమునికి బాధ్యమైయుండునని యనియు చెప్పిరి. దేశరక్షణశాఖను, ఆర్థికశాఖను, విదేశీయాంగశాఖను భారతీయుల బాధ్యతకు అప్పగించలేదని సప్రూగారాక్షేపించిరి.

26వ తేదిన జయకర్ గారు ప్రధానతీర్మానమును ప్రతిపాదించిరి. అందులో వైస్రాయి మంత్రివర్గమును పూర్తిగా పునర్నిర్మించవలెననియు, భారతదేశానికి అధినివేశప్రతిపత్తిని (డొమినియన్ స్టేటసు) ఫలానా తేదీలో గా ఇచ్చెదమని బ్రిటిషుప్రభుత్వము ప్రకటించవలెననియు కోరబడినది. పాకిస్థాను ఖండనమునుగురించి టి. ఆర్. వెంకటరామశాస్త్రిగారు ప్రతిపాదించిన తీర్మానముకూడ ఆమోదించబడినది.

డాక్టరు యస్. రాధాకృష్ణగారు తీర్మానమునుగురించి ఉపన్యసించుచు హిట్లరు జయించినచో భారతదేశము చైనాయు అధఃపాతాళమునకు పోగలవని చర్చిలుగారు చెప్పినమాటను జ్ఞాపకముచేసి, భారతదేశము ఆత్మరక్షణచేసికొనగల స్థితిలోనున్నదా యని అడిగిరి. పోయిన 150 ఏండ్లలో ఆకళంకమైన బ్రిటిషు నిరంకుశాధికారమువల్ల భారతదేశము ఇప్పటి ఆత్మరక్షణశక్తిహీనస్థితికి వచ్చినదని. "అహింసయందు విశ్వాసముచే గాని, ప్రపంచమును నిరాయుధము చేయు విధానమునుబట్టి గాని బ్రిటను మనలను నిరాయుధము చేసినదని నమ్మవద్దు. అయినను మనప్రజలు ఈ యుద్ధంలో బ్రిటిషు ప్రజలతో చేరి పోరాడుటకు కుతూహలురై యుండిరా" అని వారు చెప్పిరి.

యుద్ధమునకుముందు పండిత జవహర్లాలు నెహ్రూగారు భారతదేశము ఈ యుద్ధములో సహాయపడగలదని చెప్పియుండిరి. గాంధిమహాత్ముడును అదేమాటగా బ్రిటను ఫ్రాన్సులు ఓడినచో చాల ఉపద్రవములగునని చెప్పిరి. ఇదేనిగర మరియు కాంగ్రెసు విదేశీయుల దాడిసమయంలో అహింసను వదులుకొనుటకును, గాంధిమహాత్ముని నాయకత్వమును వదులుకొనుటకును సిద్ధపడెను. ఇందుకై వారుకోరినది కేంద్రములో బాధ్యతయే-అది సమయంలో ఏమి చేయుదురు.

ఇప్పటికి విశాలవ్యాప్తిలో పెద్దదేశము భారతదేశ మొక్కటియే, భారతదేశము భారతదేశముయొక్క సంస్కృతి, నాగరికత భిన్నమైనట్టివి. భారతదేశ మీ వాటిది కాదు, భారతదేశమునకు ఆశయిచ్చెదము, ఇచ్చెదము అనుచు మారు చెప్పిరి. "ఇప్పుడు మేము మిమ్ములను నమ్మజాలము" అని రాధాకృష్ణగారు చెప్పిరి "అవసరసమయములు వచ్చినప్పుడులేక ఉత్సాహము వచ్చినప్పుడు గాని ఆటువంటి ప్రకటనలుచేసి మనలను సంతృప్తి పరచయత్నించినారు. ఇప్పుడు మేము ఫలానా తేదికి అని గడువు నిర్ణయించవలెనని ఇప్పుడు మేము కోరుచున్నాము" అనివారడిగిరి, భారతదేశ మడిగినదానికి మర్యాదగానే అనిర్థారితార్థములను, పదజాలగహనములో తప్పించుకొనిపోవు లక్షణము కలిగియునది. ప్రకటనలతో సమాధాన మిచ్చినందుకు వారు చింతపడిరి. మహాసభవారు కొలనిసీయమునుగా అమెరికను 'నెస్సు నెస్సు' గా అనివాదిచ్చినారు మహాసభ వారు భారతదేశానికి తక్కినస్వపరిపాలనగల అధినివేశాలతో సమానమైనస్థితిని కోరగా 'క్రమక్రమముగా మీభాగమును వృద్ధిచేసెదము' అని అమెరీగారు చెప్పినారు- అని రాధాకృష్ణగారాక్షేపించిరి.

సప్రూగారు మహాసభాచర్యల అంతమున ఉపన్యసించుచు క్రొత్త రాజ్యాంగమును ఫలానా తేదిలోపల అమలులోపెట్టెదమని గడువు ప్రకటించవలెనని చెప్పిరి. భారతదేశంలో బ్రిటిషు విధానముయొక్క లక్ష్యము అధినివేశప్రతిపత్తి యని 1931 శాసనములో చేయుచున్నను, ఆమాటలు గట్టిగా చెప్పుటకు బ్రిటిషుప్రభుత్వానికి 10 ఏండ్లు పట్టినవని, కాబట్టియీ మహాసభవారిపుడు గడువు నిర్ణయముకోరుచున్నారని. నానిపరిస్థితులనుబట్టి మార్పుకొనిన మార్పుకొనవచ్చును. నన్ను జనులు తీరుపరుల్లు కోరవాదని గాని, ఆచరణసాధ్యం గాని ఏర్పాటులుకోరు రాజకీయమువారయని గాని అన్నను ఫరవాలేదు అనివారనిరి.

కొందరు పెద్దపెద్దవారలు ప్రస్తుత భారతదేశపరిస్థితులనుబట్టి మార్పుచేసుకొని కార్యనిర్వాహకవర్గమును, వృత్తులవారిగా ప్రతినిధులను ఎన్నుకొను పద్ధతిని అవలంబించవచ్చునని చెప్పుకొనుచున్నారు వాటివల్ల ఉపద్రవము కలుగగలదని సప్రూగారు చెప్పిరి. పైరెండుపద్ధతులను కోరు ప్రాముఖ్యముగల వ్యక్తులు భారతదేశములోను ఇంగ్లాండులోను ఉండుటవల్ల మరింత ఉపద్రవముగానున్నది, అటువంటివిధానమును ఇంగ్లాండులో గొప్పపదవులలో ఉండువారు బలపరుచుచుండ ఆవిధానముయొక్క అర్థమేమిటో ప్రజ అర్థముచేసికొనవలెను. అవిధానాన్ని కోరు కొందరు భారతదేశంలో ఉన్నారు వారిలో ఒకరైనను వైస్రాయి మంత్రివర్గ సభ్యుడు కావచ్చును- అని సప్రూగారు ముగించిరి-

## దొంగబర్లిను నగరనిర్మాణము

జర్మనీలోని బర్లినునగరముపైకి బాంబులువేయుటకై వచ్చు బ్రిటిషు విమానములను బోల్తాకొట్టించుటకై కృత్రిమబర్లిను నగరనిర్మాణము చేయబడినది- అందులో చిన్న కొయ్యయిండ్లు కట్టినారు- బర్లినులోనుండు వీధులన్నియు కృత్రిమముగా నిర్మించబడినవి బర్లినులో రైలుమార్గము రైలుస్టేషను కూడ వాటివాటిస్థానములకు తగినట్లు నిర్మితములైనవి- రాత్రిళ్ళు మసక మసక దీపాలు వెలిగించబడును - బ్రిటిషువిమానాలు బర్లినుమీదికి వచ్చిపోయినతర్వాత ఈకృత్రిమనగరంలో పెద్దమంటలను వెలిగింతురు- వీటినితరువాత బర్లినుమీదికవచ్చే బ్రిటిషువిమానాలు చూచి తమకంటెముందువచ్చినవిమానాలు బర్లినును తగులబెట్టినాయని మోసపోవునట్లు చేయవలెనని జర్మనుల ఉద్దేశ్యము ఈకృత్రిమనగరము అనేక మైళ్ళ వైశాల్యముగలదై యున్నది- ఈనగరమువద్ద కొద్దిమంది సైనికులు మాత్రము ప్రయాణీయులేరు గాని దానిరహస్యము తెలిసికొనుటకు అనగరములోనికరాకుండ కాపలాయుంచబడియున్నారు-

## గ్రీసులో స్త్రీలు క్షుద్బాధచే మరణము

ఇప్పుడు గ్రీసులో క్షామమేర్పడియున్నట్లు ఒక బ్రిటిషు పత్రికవిలేఖరి వ్రాయుచున్నాడు అక్కడి 80 లక్షల ప్రజలయవస్థ చెప్పనలవికాదు గ్రీసువారి వర్తకనౌకలు యుద్ధంలో నష్టమైనందున ఆహారపదార్థములను ఇతరదేశాలనుండి తెప్పించుకొనలేరు- సాధారణంగా అవసరమైనదానిలో 3వభాగము రొట్టెమాత్రమే ఒక్కొక్కనికి యివ్వబడుచున్నది ప్రధాననగరమగు ఏథెన్సులో స్త్రీలు ఖాళీకడుపుతో తిరుగుట క్షుద్బాధచే ఆకస్మికమరణములకు గురియగుచున్నారు- పిరయూసులో కండాపెక్కలరగా ... పొలాలలో పశువులు అస్థిపంజరములవలె యున్నవి- ఉన్నకొద్ది ఆహారపదార్థాలధరలు యుద్ధానికి పూర్వం ఉండేవాటికంటె 20 ఇంతలుగానున్నవి- ఏథెన్సులో ఇండ్లులేనివారు తిండిలేనివారు నిండియున్నారు- అంటువ్యాధులచే మరణము ఘోరముగా ఎక్కుయున్నవి- 'అమెరికన్ రెడ్ క్రాస్' సంస్థవారును 'జెనివా రెడ్ క్రాస్' సంస్థవారును ఈజనులఆపదతొలగించుటకై చేతనైనదంతయు చేయుచున్నారు-

## ఫిన్లెండు బ్రిటనుతో మైత్రిని తెంచుకొనుట

ఫిన్లెండు ప్రభుత్వ విదేశాంగమంత్రి ఫిన్లెండులోని బ్రిటిషుప్రభుత్వ రాయబారికి జూలై 31వ తేదిన అందజేసిన ఒక లేఖలో ఫిన్లెండు జర్మనీతోకలిసి యుద్ధముచేయుచున్నందువల్ల బ్రిటనుతో సాధారణ రాజకీయసంబంధమునుంచుకొనజాలదని తెలిపెను- బ్రిటిషురాయబారి దీనికి రము ఫిన్లెండు బ్రిటనుతో తెగతెంపులు చేసుకొన్నట్టే గా అని అడుగగా, అవునని ఫిన్లెండు విదేశాంగమంత్రి అంగుసమాధానమిచ్చెను-

## భారతసముద్రములోకి దూకుటకు జర్మనునౌకల సంసిద్ధత

ఇప్పుడు పారసీక సింధుశాఖలో నాలుగు జర్మను వాణిజ్యనౌకలుఉన్నవి-అవిఎప్పుడైనను భారతసముద్రంలోకి జొరపడవచ్చును జొరపడి భారతసముద్రంలో ఉండే ఓడలపై దెబ్బలుతీయవచ్చును—అని ఒక తుర్కీదేశమందలి విలేఖరి వ్రాసినాడు-

## ముసోలినిని చంపే ప్రయత్నము

ముసోలినీ ఫెరారాలో సేవలరహస్యయుద్ధరంగమునకు పోవునపుడు వాటినిపరిశీలించబోయి, అక్కడఉన్నరోజులలో ఒకవాడు లూయిగీరో వాజియో అను రాజభక్తిపాతీచే తుపాకిగుండు ముసోలినిపై ప్రేల్చబడిన దికాని దెబ్బతప్పిపోయినది

## జర్మనీ, ఇటలీప్రదేశాలపై బ్రిటిషు బాంబులు

బ్రిటిషువిమానాలు జర్మనీమీదను, జర్మనుల ఆక్రమణలోనున్న దేశాలమీదను, బాంబులువేయుచునేయున్నవి- జూలై 30వ తేదిన జర్మనుల రైన్ లాండులో కలోనునందలి పరిశ్రమాలయాలమీదను రోటర్ డాంలోని డాకులమీదను, ఫ్రాన్సులో జర్మనుల విమానాశ్రయాలమీదను బాంబులు వేయబడెను, అడ్డమువచ్చినమూడు జర్మనువిమానాలు క్రిందకూల్చబడెను- ఒక బ్రిటిషు విమానము తిరిగిరాలేదు వేసినబాంబులవల్ల మంటలు ఎక్కువగా లేచెను- జూలై 31వ తేది పగలు ఇంగ్లీషుఛానల్ పైనను, ఫ్రాన్సులోను రెండు జర్మనువిమానములు క్రిందకూల్చబడినవి- ఉత్తర ఫ్రాన్సు నార్మండీ సముద్రంలో లీలీకద్ద జర్మను ఓడలపై బాంబులువేయబడినవి అడ్డమువచ్చిన 2 జర్మనువిమానాలు నాశముచేయబడెను- 3 బ్రిటిషు విమానాలు కనిపించుటలేదు 31వ తేదిరాత్రి పశ్చిమ జర్మనీలో పరిశ్రమలస్థానాలపైనను, రైలుబాటలున్నగువాటిపైనను బాంబులువేయబడినవి- ఉత్తర ఫ్రాన్సులో విమానాశ్రయములు, డెన్మార్కు తీరమందలి సైనికస్థానాలు దెబ్బతిన్నవి ఆగస్టు 1వ తేదిపగలు డెన్మార్కు-పడమట సముద్రతీరమందు జర్మనుసైనికశిబిరాలు, ఉత్తర ఫ్రాన్సు సముద్రతీరమందు జర్మనునౌకానిర్మాణస్థానాలు దెబ్బలుతిన్నవి- అడ్డమువచ్చినఆయిదుజర్మనువిమానాలు క్రిందకూల్చబడినవి- 2 బ్రిటిషువిమానాలు తిరిగికనుపించుటలేదు 1వ తేదిరాత్రి పశ్చిమజర్మనీలో పరిశ్రమలస్థానాలపైనను, డన్కర్కు, రోటర్ డాములవద్ద డాకులమీదను, ఉత్తరఫ్రాన్సులో అనేక శత్రువిమానాశ్రయాల మీద

(7వ పేజీ చూడుడు)



Printed and Published by, G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad Dn Editor S. Pratnapa Reddy B.A.,B.L.,